# త్యాగమహిమ



గ్రంథకర్త:

పొనుగుపాటి వెంకటనాగభూషణము.



నమ్మాళ్వార్స

పోస్టుబాక్సు నెం ౨౫౧, మద్రాసు.

సర్వస్వామ్య సంకలితము } ౧౯౪౧ { వెల ఆరు అణాలు లేక ఒక షిల్లింగు

# ఈ నవల

భారతదేశమున మహాత్మ గాంధి సాగించిన అహింసాసమరమును పురస్కరించుకొని వ్రాయబడినది. అందును యువజనులు నడిపిన ఉద్యమముయొక్క ధోరణి విపులముగ వర్ణింపబడినది. దేశీయులలో కలిగిన రాజకీయ చైతన్యమును అవలోకించుచు భారతస్వాతంత్ర్యసమర విషయములను చేర్చుటకు అనుగుణమైన సాంఘికకథను కల్పించి గ్రంథకర్త ఈనవలను సాంఘికరాజకీయముగా వ్రాసెను.

# ఈ గ్రంథకర్త

బెజవాడ వాస్తవ్యులు. వయస్సు సుమారు నలుబది సంవత్సరములు. శ్రీవారు గొప్ప దేశసేవకులు. సత్యాగ్రహసమరమున పాల్గొని రెండు పర్యాయములు శ్రీకృష్ణజన్మస్థానమునకు వేగియున్నారు. బెజవాడలో ప్రతి ప్రజాహితోద్యమములోను ప్రబలముగా పాల్గొనుచుందురు. వీరు ప్రస్తుతము సివిక్సుమీద పుస్తకము వ్రాయుచున్నారు.

—ప్రకటనకర్తలు.

# త్యాగమహిమ

## ౧

ఆ సాయంత్రమునుండి రోగికి వ్యాధి యధికమయ్యెను. ఆరాత్రి రోగి మంచముకడ భార్య కమలమ్మయు, కొమరిత సరసిజయు కాచుకొనియుండిరి. ఇరుగుపొరుగుననుండు పరిచయులు, స్నేహితులు, బంధువులు యెడ తెఱపిలేక వచ్చి చూచి పోవుచుండిరి. డాక్టరు నారాయణరావు (యల్. యమ్. పి.) ఔషధము లేకధారగ బోయుచునేయుండెను. రోగి యటునిటు మంచముపై గొట్టుకొనుచు 'బాబు! బాబు!!' యని కలవరించుచుండెను. "ఏమి? బాబు యింకను రాలేదా? కబురు పంపితిరా? లేదా" యని యడుగజొచ్చెను.

"నాన్నా! అన్నయ్యకు తంతినంపితిని. ఈరాత్రి తప్పక రావచ్చును. అధైర్యపడకు"మని సరసిజ ధైర్యమును పురికొల్పెను. ఈస్థితిలో నెట్టకేల కర్థరాత్రమయ్యెను. గడియారమొకగంట గొట్టెను, "రైలుటైమైనదా?" యని యటనున్న మేనత్తకొమరుని కామేశ్వరుని సరసిజ యడుగ, "ఆఁ! వచ్చుచున్నదని" కామేశ్వరుడు జవాబొసంగెను.

అంతలో మరల 'బాబూ! బాబూ!!' యను ధోరణి సమూర్తిగారి కధికమయ్యెను. అచ్చటనున్న వారెల్ల రోగిని జూచి విచారనిమగ్నులైరి, ఆరాత్రి బండిలో బాబు వచ్చునను తలంపుతో లాంతరు చేతబుచ్చుకొని కామేశ్వరావు రయిల్వేస్టేషనునకుం జనెను. ప్యాసింజరు ప్లాటు

ఫారముపైకి వచ్చుచుండగనే 'బాబు! బాబు!' యని కేక లిడుచు కామేశ్వరుడు ప్లాటుఫారముపై బండివెంట నిటునటు పరుగిడసాగెను. బాబురావు కాకేకలు వినబడి తనమేనత్త కుమారుడగు కామేశ్వరుని కంఠధ్వని అని గుర్తించి, 'కామేశ్వరా! యిటు; యిట'ని పిలిచెను. 'ఎక్కడ! ఇక్కడా!' యనుచు కామేశ్వరరావు బాబురావున్న బండివద్దకు జనెను.

తన తండ్రిగారినిగూర్చి మిక్కిలి యాందోళనమును జెందుచుండిన బాబురావు, తనమేనబావయగు కామేశ్వరుని జూచినంతనె- "బావా! మానాన్నగారి కెటులున్నదని" యాతురతతో నడిగెను. "నిలువబడియున్నది. ఆందోళనమును జెందకుము. నిన్ను చూడవలెనని మాత్రము పరితపించుచు నిద్రలోగూడ కలవరించుచున్నా"రని కామేశ్వరుడు సమాధాన మిచ్చెను. అంత కొంత మనశ్శాంతినిపొంది, బాబురావు కామేశ్వరులు ప్లాటుఫారముగేటును దాటి వెలుపలకువచ్చి జట్కావానిని బిలచి బండినెక్కి ఇంటికి వెళ్లిరి. అర్ధరాత్రమగుటచే నా ప్రదేశమంతియు నిశ్శబ్దముగనుండెను. కాని రామమూర్తిగారి యింట కొంచెము సందడిగనుండెను. ఆవీధిని బండియొకటి యతివేగమున బరుగిడుచువచ్చి వారి యింటికడ నిలచెను.

బండినుండి బాబును, కామేశ్వరుడును దిగిరి. 'ఏదో బండిశబ్దము వినవచ్చుచున్నదే' యని కమలమ్మగారను తోడనే, 'బండియా? యెచ్చట?' ననుచు సరసిజ వీధిగుమ్మ[illegible] కడకు వచ్చెను. ఇంతలో ముఖద్వారమును తట్టుచు 'అమ్మా! అమ్మా!' యను శబ్దము వినవచ్చెను. 'అన్నయ్యా! నీ[illegible]' యనుచు సరసిజ తలుపుతెరచెను. ఎదుటనున్న తన [illegible]

చేరదీసి 'అమ్మా నాన్నగారి కెటులున్నది?' యనుచు రో
మంచముకడకు బరుగిడి 'నాన్నా! నాన్నా!' యని తనతం
గారి మోమువంక తదేకదీక్షగా జూచుచు బాబురావు కన్నీ
గార్ప దొడంగెను.

ఆదృశ్యమునుగాంచి యింటనున్న వారందరొ
సారిగ గొల్లుమనిరి. ఆరోదనధ్వని విని యిరుగు పొరు
వారు రామమూర్తిగారి యింటికి వచ్చి రోగిమంచముకే
విచారగ్రస్తులైయున్నవారి నూరడించి, "యిదియేమి? బా
రావు వచ్చినందులకే యింత గందరగోళమా? అతని కొకిం
ధైర్యముజెప్పుడు. లేకున్న, ఆతనిసంగతి యటుండనిచ్చి
రోగియు 'నధైర్యపడిపోవు"నని యోదార్చుటయు, మంద
లించుటయు జరిగెను. ఇంతలో రోగికి కొంచెము స్పృహ
వచ్చి, యటునిటు తేరిపారజూచి, తనవద్ద గూరుచుండియుండిన
బాబునుగాంచి, చెక్కిళ్లు తడుముచు- "నాన్నా! ఎంతకాలము
నకు నిన్ను జూచితిని? నీ వెక్కడకును వెడలవలదు. నా
యొద్దనేయుండవలయును. అట్లైన నాకు కొంచెము మనస్థిమిత
ముగానుండును." అని నుడువుచు నావలిప్రక్కకుం బొరలెను.

ఆవైపున సరసిజ గూరుచుండియుండుటంగాంచి-
"అమ్మా! ఇటురా"యని చెంతకుజేర్చుకొని- "నీవెంతటి య
దృష్టవిహీనవే, నీ వివాహమైనను జేయుభాగ్యము కలిగినది
గాదు." యని యారోగి కన్నుల నీరుగార్చెను. సరసిజ తండ్రి
కంటివెంట నీరుగారుటను చూడజాలక తానుగూడ నేడువ
మొదలువెట్టెను. అక్కడ నుండువా రందరు "అయ్యో! ఇది
యేమి? మీరు విశేషముగ మాటలాడజనునా? ఊరకుండుడు.

చుక కాలము విశ్రమింపు''డని మందలించిరి. ఆనాట
లించి, రామమూర్తిగారు వల్లెయని కనులుమూసుకొని
ండిరి.

రోగికి కొంచెము కొంచెముగా మగతనిద్ర పట్ట
చ్చెను. నిశ్శబ్దముగనుండుడని నుడివి యిరుగుపొరుగువా
రు తమతమ యిండ్లకేగిరి. ఎటులో యారాత్రి గడచి
యెను.

మరునాటి యుదయమున బాబురావు నిత్యకృత్యములం
చుకొని తనతండ్రిగారి చెంతకుజనెను. డాక్టరుగారు రోగిని
రీక్షించి యౌషధమునిచ్చి వ్యాధి నెమ్మదించునని ధైర్యము
జెప్పిరి. రామమూర్తికిగూడ తనయారోగ్యము చక్కబడునని
కొంత ధైర్యము గలిగెను. బాబురావు డాక్టరుగారితో ముచ్చ
టించిన యనంతరము తనమిత్రుని కీవిధముగ లేఖవ్రాసెను.

అమృతవిలాస్, హేలాపురము,
ఏప్రియల్ 20.

''ప్రియమిత్రమా !

మీవలన సెలవుగైకొని గృహమునకు సురక్షితముగ జేరితిని. మా నాన్నగారజీర్ణవ్యాధిచే మిక్కిలి బాధనొందుచున్నారు. డాక్టరు నారాయణరావుగారు చికిత్సజేయుచున్నారు. డాక్టరుగారు వ్యాధి నెమ్మదించునని ధైర్యముగ జెప్పుచున్నారు. మానాన్నగారు కడు వృద్ధులగుటచే నాకింత భీతినొందవలసి వచ్చుచున్నది. భారమంతయు నాపరమేశ్వరునిపైననే యాధారపడియున్నది. వృద్ధులై క్రూరవ్యాధిచే బాధపడుచుండు మానాన్నగారు నాపై జెంగనిడుకొని మిక్కిలి మనోవ్యాకులత్వమును జెందియున్నారు. నన్నుగాంచుటతోడనే యొకింత మనశ్శాంతి గలిగెనని తోచుచున్నయది. తన చెంతనుండి యెటకును బోవలదని మరి

మరి నడుపుచుండుటచే మీకు జాబు వ్రాయవలయునను యాతురతతో తపాలాకచ్చేరీకి మాత్రము వచ్చియుంటిని. ఇచ్చటి నాయాప్తులు నాయోగక్షేమమునుగూర్చి ప్రశ్నింప, తమస్నేహవాత్సల్యతనుగూర్చి గూడ వారికి తెలియజేసితిని. వారెల్లరు మిమ్ముల జూడ గుతూహలపడుచున్నారు. నేను పదిదినములలో తమ సమక్షమునకు వచ్చెదనని మనవిజేసియుంటిని. అనుకూలపరిస్థితు లేర్పడునంతవరకును ఇచ్చటనే యుండవలసివచ్చునని తలంచెదను. మనసంఘముయొక్క భారమంతయు తమరొకరిమీదనే కొంత కాలమువరకును నుంచవలసి వచ్చినందులకు మన్నింపగోరుచున్నాడను. మాతండ్రిగారి శరీరస్థితినిగురించి ప్రత్యేకముగ నేడే మీనాన్నగారి కొక జాబు వ్రాయుచున్నాడను. ఈ లేఖ తమ కందినతోడనే యెల్లర యోగక్షేమముల దెలుపుచు నవకాశమున్నయెడల యొకపర్యాయము తమదర్శన భాగ్యము లభింపజేయ పదింబదిగ ప్రార్థించు, మీయనుంగు మిత్రుడు,

బాబురావు.''

ఉత్తరమును తపాలాపెట్టెయందు బడవైచి బాబురావు యింటికివచ్చెను. అదిచూచి సరసిజ ''అన్నయ్యా! యెచ్చటకు వెళ్ళితివి? నాన్న నిన్ను రెండుమూడు పర్యాయములు పిలిచినా''డని యనెను.

''అటులనా? మిత్రుడగు శ్యామసుందరునికి జెజవాడ జాబువ్రాయ తపాలాకచ్చేరీకి వెళ్ళియుంటి''నని సమాధాన మిచ్చెను. గృహములోపలికి వెళ్ళిన యనంతరము తాను వ్రాసిన యుత్తరమునందలి సమాచారములను తన చెలియలకు యెరిగించుచు, తనమిత్రుని సుగుణవిశేషములను గూర్చి శ్లాఘింప మొదలిడెను.

ఆపలుకు లాలకించినంతనే యాముదిత కేలనో మనంబు చలించి యాలోచనానిమగ్నయై తమయింటి నంటియున్న

యరటిపెరటికిజని యట నొక చలువరాతిపై గూరుచుండి తనలో తా నిటుల తలపోయ జొచ్చెను. "సామాన్యముగా యొకవ్యక్తినిగూర్చి మాయన్న యంతగా శ్లాఘించెడువాడు గాడు. ఆతని మనంబున కెవరును నచ్చరు. అట్టియెడ మాయన్న నుడివిన విషయములను సాకల్యముగా విచారించి చూచినయెడల నావ్యక్తి గొప్ప మేధావంతుడును, సౌందర్యరాశియు, సుగుణపుంజమునని తోచుచున్నయది. మాయన్న వ్రాసినజాబునందు తనమిత్రుని యొకపర్యాయము ఇచ్చటకు దయచేయుడని వ్రాసెనుగదా? దీనివలన నాసుగుణరాశిని కనులారజూచు భాగ్యముగూడ లభింపవచ్చును. అయినను ఇంత మాత్రమున నిటకు శ్యామసుందరుడు వచ్చునో? రాడో? ఆతని సుగుణములను వినినప్పటినుండియు నామన మేలనో యాతని దర్శింప నుత్సహించుచున్నయది." యని యింక నేమేమియో యనుకొనుచు నింతలో దనతల్లిపిలుపు వినవచ్చినందున నాస్థలమును వీడి గృహాములోనికిం జనియెను.

ఇటుల కొన్నిదినములు జరుగునప్పటికి రామమూర్తిగారి శరీరమున కొంకింత స్వస్థత చేకూరెను. తనలేఖకు సమాధానము వ్రాయుటగాని, లేక తనమిత్రుడు వచ్చియుండుటగాని జరిగియుండని కారణమున గాబోలు బాబురావు కేమియుం దోపక విచారమనస్కుడై యుండెను. తనయన్నగారు నుడివిన ప్రకారము శ్యామసుందరుడు రాకపోయెనేమి యని సరసిజ గూడ లోలోన తలచుచుండకపోలేదు. అయినను తనకు శ్యామసుందరుని దర్శింపవలెనన్న గుతూహాలమున్నటుల బాబురావుతో చెప్పుటకు సరసిజకు ధైర్యము చాలకపోయెను.

ఒకనాటి సమయమున తన మిత్రునకు బాబురావు మొదట తంతినివ్వ నుద్దేశించెను గాని, యటుపిమ్మట తండ్రిగారి వద్ద సెలవుగైకొని తానే వెడల నిశ్చయించుకొనెను. అనంతరము ఫలాహార మొనరించుటకై కాఫీహోటలునకు గాబోలు బజారువైపునకు పయనమై వెళ్లెను.

వాడుకచొప్పున యానాటి ప్రాతఃకాలమున వార్తాపత్రికలు నలుదిశల వ్యాపింపజొచ్చెను. రామమూర్తిగారింటికి ప్రతిదినము హిందు, ఆంధ్రపత్రికలు వచ్చుచుండెను. సరసిజ యా పత్రికలజదివి తండ్రిగారికి వినిపించుచుండెడిది. నిత్యము దేశవార్తలం దిలకింపుచుండిన సరసిజకు దేశభక్తి క్రమక్రమముగా నభివృద్ధినొందజొచ్చెను. ఇదివరలో నామె కద్దరువస్త్రములగొనితెమ్మని తన తండ్రిగారి నెంతయు విసిగించుచుండెడిది. రామమూర్తిగారుమాత్రము కొంచెమేనియు నిచ్చగించెడువారుగారు. ఆయనకును దేశమన్న ప్రీతిగలదుగాని, యంతకన్న పాలకులభయము మెండుగానుండెను. ఆకారణమున తమ యింట కద్దరువస్త్రములమాట నెత్తకుండ నొనర్చుచుండెను. ఇట్టిస్థితిలో కద్దరువస్త్రముల ధరించుచుండిన తనయన్నగారిని జూచి సంతసించి సరసిజ తనయన్నగారివలె తానును కద్దరు దీక్షగైకొన నుద్దేశించెను.

ఆనాటివార్తాపత్రికలు తమయింటి కరుదెంచుటతోడనే సరసిజ త్వరితగమనమునజని, వాటి నందికొని "యాంధ్రపత్రిక"ను తెరచి, యట నొక కుర్చీపై గూరుచుండి చదువ నారంభించెను. అందు విజయపురిలో నూతనముగ స్థాపించిన యువజనసంఘముయొక్క వృత్తాంతము పెద్దపెద్ద

యక్షరములతో వ్రాయబడియుండిన శీర్షికనుజూచి, యందలి విషయములనెల్ల సాంగోపాంగముగా చదువుచుండెను. శ్యామసుందరుడా సంఘమున కధిపతియనియు, తనసోదరుడు కార్యద్రష్టయనియు, జూచుటతోడనే తనలోతాను మురియ జొచ్చెను.

అంతకుముందు తనయన్నగారి కుండెడు యభిప్రాయములు మారినందుల కెంతయు సంతసింపదొడంగెను. తన యన్నగారి నీ మార్గమునకుం ద్రిప్పగలిగినది శ్యామసుందరుడే యై యుండనోపునని నిశ్చయించుకొనియెను. అనంతర మావలి పుటను ద్రిప్పిచూడ, పై వారిద్దరి చిత్రపటములును గాన వచ్చెను. తనసోదరుని చిత్రమునుజూచి, యాకుడిప్రక్కనున్న శ్యామసుందరుని చిత్రపటము నవలోకించి, యంతకుమున్న వానిని గూర్చి తనయన్నగారు చెప్పిన విషయములు జ్ఞాపకమునకు రాగా, నానందమున నాచిత్రపటమును నిలువెల్ల తేరిపార జూచి సంతసించెను.

ఇంతలో బాబురావట కరుదెంచి "సరసిజ! అది యేమి? పత్రిక నంత యాశ్చర్యమున దిలకింపుచుంటివి? అందేమి విశేషములున్నయవి?" యని త్వరితమున తన చెలియలను సమీపించెను. అంత సరసిజ "అన్నయ్యా! ఇందు మీ పటము లున్నవి" యని, యాపత్రికారాజమును తన సోదరునకు జూపెట్టి, తన చెలికానిచిత్రమునుగాంచి, యొకింత విచారమును, మరొకింత సంతసమును వెలిబుచ్చెను. తన యన్నగారి ముఖలక్షణములను సరసిజ గుర్తించి—"అన్నయ్యా! వీరేనా నీమిత్రులు?" నని యింకనేమో చిరునగవులొలుక, బలుక

బోవుచుండ, నింతలో త్వరితమున వీధిగుమ్మముకడ నొకబండి వచ్చి నిలచెను.

"ఆబండి యెక్కడిది?" యని బాబురావు వీధిగుమ్మము కడకు వచ్చుచుండ, సరసిజగూడ అతని వెనువెంటనే వచ్చి తలుపుచాటున నిలువబడి, బండిదిగుచుండెడి యావ్యక్తినిగాంచి యింతకుమున్ను తాజూచిన చిత్రపటము జ్ఞాపకమునకురా, శ్యామసుందరుడేయని నిశ్చయించుకొని, కొంచె మోసరిల్లి, బిరబిర నాజవ్వనియింటిలోనికిం జనియెను.

బాబురావు తనమిత్రు నవలోకించి, యమందానందమున "శ్యామా! నీవు పూర్ణాయుష్మంతుడవోయి! ఇప్పుడే నిన్ను గూర్చి తలంచుచుంటి"మని నుడువుచు, కరస్పర్శనముగావించి, యింటిలోనికిం దోడ్కొనిపోయెను. ఆమిత్రు లిరువురు సావడిలో గూరుచుండి, కొంతతడవు ముచ్చటించి, పిమ్మట రామమూర్తిగారు పరుండియుండిన గదికింజనిరి. శ్యామసుందరుని తన తండ్రిగారి కెరుకపరచి, యాతనినటవిడచి, బాబురావు యింటిలోనికింజనియెను.

శ్యామసుందరుడు రామమూర్తిగారి యారోగ్యవిషయములనుగూర్చి సంభాషించుచుండెను. మరొకింత తడవైన పిమ్మట బాబురావట కరుదెంచి "శ్యామా! వంటయైనది. స్నానమునకు వెళ్లుదమురమ్మని" తన చెలికానినిదోడ్కొని పోయెను. శ్యామబాబుల స్నానమునకై సరసిజ వేగముగ నీరు తోడి, పీటలవైచి, సబ్బు, చలువ తుండ్లు, పీతాంబరముల నట నుంచి, యావలికిజనియెను. శ్యామబాబులు స్నానమాచరించి, పీతాంబరముల ధరించి, యటనుండి భోజనశాలకుజనిరి. స్నాన

మొనరించుచున్నపు డా సుందరుని యావలివైపుననుండిన సరసిజ గాంచెను.

ఆతనిరూపురేఖావిలాసములను తనమనోఫలకమునందు జిత్రించుకొని, యేమియుదోపక నా ప్రాంతముననే యుండిన యొక పనసచెట్టుక్రింద కూరుచుండి తనలో తా నీ విధమున తలపోయజొచ్చెను. "ఆహా! ఈతని సౌందర్యమేమని వర్ణింప గలను! ఈతని పరిణయమాడు వనిత యెంతటి భాగ్యరాశియో గదా! ఈ సుందరుని మృదుమధురవచనము లాలించినంతనే నామన మేలనో యీసుగుణశాలిచెంతకు యాకర్షింపబడుచు న్నయది. ఈతనిగూర్చి మాయన్న నేమని యడుగవలయు! ఆతని సుగుణములను నాచిత్తక్షేత్రమున నంకురిత మొనర్చిన మాయన్న నొకవేళ యడిగిన ఆయన నన్నుగూర్చి యేమని యభిప్రాయపడునో! నేను కన్యకను. యుక్తవయసువచ్చినను మాతలిదండ్రులు నావివాహవిషయమై యిసుమంతయైనను యాలోచింపకపోయిరి. ప్రస్తుతమన్ననో మాతండ్రిగారు జబ్బు గానుండిరి. నామేనబావయగు కామేశ్వరునకు నన్నిచ్చి వివా హముజేయుదురని మాయమ్మ యప్పుడప్పుడు నుడువుచుండె డిది. కాని మాయమ్మమాత్రము నన్ను కామేశ్వరున కిచ్చుటకు సమ్మతింపదు. మాతండ్రిగారు సంఘసంస్కర్తలయ్యు నన్ను తన మేనల్లునకిచ్చి పరిణయమొనర్ప నుద్దేశించుచుండిరి. కామే శ్వరునకన్ననో విద్యాబుద్ధులు పూజ్యములు. అదిగాక వయసు మీరినవాడు. సౌందర్యమునుగూర్చి యడుగ నవసరమే లేదు. ఆస్తిపాస్తుల మాటయా! నిలువనీడలేక పొట్టకూటికై మా యింట పడియుండువాడు. అట్టి నిర్భాగ్యదామోదరునికి నన్నిచ్చి

వివాహమొనరించి, మాయుభయుల మనోవర్తికై యొకింత భూమిని యరణమిత్తురట. ఇది యేటిన్యాయము? నిరక్షరకుక్షికి నన్నిచ్చి నాగొంతు కోయనుంకించుట కెవరైన నిచ్చగింతురా? దుర్బలుడై యేమియుం జేతగానివలె మాయన్నమాత్ర మూరకుండునా! యేది యెట్లైనను నేనానిర్భాగ్యుని మాత్రము పరిణయమాడజాల. త్రిమూర్తులువచ్చి ప్రతిమాలినను నేనా మూర్ఖుని జేపట్టనొల్ల. నాతలిదండ్రులు నాపై గినుక బూనిన బూనుదురుగాక, ఒకవేళ కాలచక్రముతిరిగి యెదురైనచో నసువులబాసి పరలోకమునకేగెదగాక''యని తలపోయుచు కనులవెంట నశ్రుధారలు జలజలరాల దనలోదాను దుఃఖించుచున్నసమయమున నటులెవరో వచ్చుచున్నటుల శబ్దము వినవచ్చి తనవంక నెవరును చూడలేదుగదాయని కనుల నద్దుకొని యాస్థలమును వీడి యింటిలోనికిజని పడకగదియందు పరుండి యుండెను.

ఆనాడు తనమిత్రునిరాకనుగాంచినంతనే బాబురావు సంతోషమున పలువిధములగు భక్ష్యభోజ్యములను తయారు చేయ నేర్పాటుజేసెను. మిత్రు లిరువురు పీటలపై గూరుచుండిరి. శాకపాకములన్నియు వెండిపళ్లెరములలో వడ్డించి కమలమ్మ' యట నొక ప్రక్కన నిలువబడియుండెను. శ్యామ బాబులు సంతోషముతో నొకరినొకరు విశేషము లరయుచు భుజింపుచుండిరి. కమలమ్మ శ్యామసుందరుని జూచి యాతని సౌందర్యసౌశీల్యముల కచ్చెరువందుచు 'తమకు వివాహకార్యమైనదా?' యని ప్రశ్నించెను. శ్యాము డెన్నడు నాడువారితో తలయెత్తి మాటాడినవాడుగాడు. ఆకారణమున

శ్యామసుందరు డొకింత సిగ్గునభినయించి మిన్నకుండ, బాబు రావు తన తల్లితో—"అమ్మా! ఈయన కింకను వివాహము కాలేదు. అనేకసంబంధములు వచ్చుచున్నను ప్రస్తుత మీయన వివాహ మొనర్చుకొనుట కిచ్ఛగించుటలేదు." అని ప్రత్యుత్తరమిచ్చెను.

అంత కమలమ్మ మనమున నిట్లాలోచింప దొడగెను. "ఈ యౌవనుడు కడుసౌందర్యరాశి. చిరుతప్రాయము వాడు. విద్యాబుద్ధులను గురించియు, భూవసతి మున్నగు విషయములనుగురించియు మాబాబు యిదివరలోనే యుగ్గడించి యుండెను. ఈయువకుని గాంచినప్పటినుండియు నామనమున మిక్కిలి యానంద ముప్పతిల్లుచున్నయది. శుభసూచకమో యన నాయెడమకన్నుగూడ అదరుచున్నయది. ఈయన మా సరసిజకు తగిన యీడుజోడు గలవరుడు. నాముద్దులపట్టి నీ సుందరుని కిచ్చి కల్యాణ మొనర్చినచో సీతారాములవలె ననుకూలదాంపత్యముగా నుండగలదు. ఇంతకును బ్రహ్మలిఖిత ముండవలయునుగదా? నాసరసిజను యింటబడియున్న యా తిండిపోతునకిచ్చి పరిణయ మొనర్ప నిష్టపడుదునా? అటు లెన్నటికిని జరుగదు. నా మేన ప్రాణములున్నచో ఈమేనరిక సంబంధమును విచ్ఛిన్నము గావించి తీరెద"నని పరిపరివిధముల ననుకొనసాగెను. శ్యామబాబులు భోజనానంతరమున సావడిలోనికిజని యట కుర్చీలపై గూరుచుండి తాంబూలచర్వణ మొనర్చుచు కులాసాగా కబుర్లు చెప్పుకొనుచుండిరి.

ఇచ్చట పడకశయ్యపై బరుండిన సరసిజ యింకను లేవలేదు. అనేకవిధములగు తలంపు లా యువతిమనమున జొచ్చి

మనోవేదన మధికమై చీకాకుజెంది మిక్కిలి దుఃఖితయై యుంటచేగాబోలు యాకుసుమకోమలి కను లుబ్బి యుండెను. శరీరము వెచ్చనై శిరోభారము వొడమి బడలిక హెచ్చయ్యెను. ముఖలక్షణములు వాడువారి, కనులుమూసికొని పరుండి యుండెను.

ఇట్టిస్థితిలో కమలమ్మ—'అమ్మా! సరసిజ! భోజనము నకు రమ్మని' పిలువజొచ్చెను. సరసిజ రానికారణమున కమలమ్మ తన కొమరితను పిలుచుకొనివచ్చుటకై పడకటింటి వైపు నకుబోయెను. అచ్చట మంచముపై బరుండియుండిన సరసిజను గాంచి 'అమ్మా! లేచిరావే' యనుచు మంచమును సమీపించెను.

కాని సరసిజ పలుకదయ్యెను. 'సరసూ, సరసూ' యని యెన్నిమారులు పిలిచినను నాసుదతీ లేవకపోగా నటునిటుమైన పొరలియుండలేదు. పరధ్యానచిత్తయైయుండిన సరసిజ కాయమపిలుపు లెట్లు వినబడును? ఆముదిత మాటాడక యట్లే పరుండియుండెను. అంతట కమలమ్మ మరల 'సరసు! సరసూ' యని చేతితో తట్టి లేపెను. చిత్తము పరధ్యానము నుండి మరలి యాజవ్వని నిట్టూర్పువిడిచి 'అమ్మ; ఊఁ; ఊఁ;' యనుచు మూలగసాగెను. 'సరసిజ! యేల యిటుల బరుంటివని' కమలమ్మ యడుగజొచ్చెను. అంత, సరసిజ 'అమ్మా! నాకేలనో ఒడలు బడలికగానున్నదని' హీనస్వరమున బలుకుచు నావలి ప్రక్కకు బొరలెను. 'అమ్మా! ఇదియేమి? ఇప్పుడేగదా కులాసాగా తిరుగుచుంటివి?' యని తనకేమియు

బాలుపోవక తన కొమరుని పిలువ నుద్దేశించి 'ఒరే! బాబూ! యిటురా' యని కమలమ్మ పుత్రుని బిలిచెను.

తల్లి పిలుచుటచే తనమిత్రునట విడచి బాబు యింటిలోనికిజనియెను. కమలమ్మ మంచముపై గూరుచుండి కొమరితపై జేయివైచి యేమియుదోపక విచారించుచుండెను. ఇంతలో 'అమ్మా! ఏల పిలచితివని' బాబురావు గదిలోనున్న తనతల్లిని సమీపించెను. 'బాబూ! సరసిజ లేవలేదు. జ్వరము వచ్చినటులున్నది' యని నుడువుచు తిరిగి తన ప్రేమంపు పట్టిపై జేయివైచి 'అబ్బా! ఒడలెంత వేడిగనున్నదో చూడు'మని కమలమ్మ తన కొమరునితో ననెను.

తనసోదరికి జబ్బుచేయుటచే బాబురావు కేమియు దోపక 'డాక్టరుగారిని పిలుచుకొనివత్తు'నని నుడువుచు తన మిత్రుడు కూరుచుండియుండిన సావడిలోనికి జనియెను. తన చెంత కరుదెంచి విచారమనస్కుడై కూర్చుండియుండిన మిత్రునిగాంచి- "బాబూ! యేల యిటు లున్నాడవు? మోము చిన్నబుచ్చుకొని కూర్చుంటివేల?" యని శ్యాముడు ప్రశ్నింప, "మరేమియులేదు నాచెలియలు సుస్తీగానున్నది. ఉదయము నుండియు భోజనమైనను జేయలేదు. ఇప్పుడేలనో సరిగా మాటాడుటలేదు. నేను వేగమునజని డాక్టరుగారిని దోడ్కొని వచ్చెదను. నీ విటనే కూరుచుండియుండు" మని నుడివి బాబురావు పయనమైపోయెను. శ్యామసుందరు డొకింత విచారించుచు, "అయ్యో! పాపము. ఆమెయే సరసిజయై యుండనోపు. అస్వస్థతచే గాబోలు నామె యుదయమునుండియు గనుపించినదిగాదు. ఏమిజ్వరమో! ఎంత తీవ్రముగా నున్నదో! లేని

యెడ సరిగా మాటలాడుటకుగూడ నేల శక్తిచాలకపోవునని" యనుకొనుచు నేమియుదోపక నట బల్లపై నుండు "హిందూ" పత్రికను తిలకింపుచుండెను.

సరసిజ యుక్తవయసు వచ్చినకన్యయని శ్యామునకు తెలియదు. నాడు సరసిజ యస్వస్థతగానున్నదని రామమూర్తి గారికిని తెలియదు. కామేశ్వరు డా యుదయమునుండియు యింటికిరాలేదు. ఇంట నితరు లెవ్వరు లేనికారణమున కమలమ్మ శ్యామసుందరుడు కూరుచుండియుండిన సావడివైపునకు వచ్చి- 'అయ్యా! మాబాబు యింకను రాలేదా?' యని యడిగెను. స్త్రీలతో ముఖాముఖిగా మాటలాడు స్వభావముకలవాడుకాడుగాన శ్యాముడు తలవంచుకొని; 'రాలేదు. వచ్చుచుండవచ్చు'నని ప్రత్యుత్తరమిచ్చెను. 'మాఅమ్మాయికి జ్వరము చాల తీవ్రముగనున్నదని' యింక నేమో యనబోవుచుండ నింతలో వీధివాకిట బండివచ్చి నిలచెను. త్వరితముగ డాక్టరుగారు, బాబురావు బండిదిగి యింటిలోనికి వచ్చిరి. డాక్టరుగారు సావడియందు కూరుచుండియుండిన శ్యామసుందరునికడ కరుదెంచి యటనుండి శ్యామబాబులతోగలసి సరసిజ పరుండియుండినగదికిం జనిరి.

సరసిజకు తాపమధికమై వేడినిట్టూర్పులు విడువ జొచ్చెను. కనులవెంట నీరుగార చెక్కిళ్ళపై ధారగట్టుచుండెను. సరసిజకు జనించిన జబ్బును యెవరు గుర్తింపగలరు? కందర్పజ్వరపీడితయగు నాయువతిబాధ లిటుల చల్లారునా? ఆ సుకుమారి పరితాప మెటుల చల్లనగును? ఆసుదతికి మనశ్శాంతి యెటుల చేకూరును? ఇట్టి జబ్బును వర్ణింప నేరితరము? మనో

వ్యాధిచే పీడింపబడుచున్న యాముగ్ధ కౌషధములు పని చేయునా! మనోవ్యాధికి మందు లేదను నార్యోక్తి వినమే.

డాక్టరుగారు తమ కంఠమున నాభరణమువలె ధరించిన రబ్బరు కాడలుగల (స్టెతస్కోప్) గొట్టమునుదీసి చెవుల దూర్చు కొని యాగొట్టముల సహాయమున సరసిజను పరీక్షింపసాగెను. 'అబ్బా! 102 డిగ్రీల జ్వరమున్నది. భోజనము పెట్టితిరా?' యని యడిగెను. వెంటనే కమలమ్మ- 'అయ్యా! యింతవరకు భుజింపనేలే'దని యనెను. అంత సరసిజ యచ్చటనున్న వారి నెల్ల పరిశీలించి చూచెను.

శ్యామసుందరుడు సరసిజను గాంచినంతనే తానిదివరకు దలంచినటుల సరసిజ బాలప్రాయమున లేదనియు, యుక్త వయసువచ్చిన కన్యకయనియు గ్రహించెను. పరస్త్రీని కన్నెత్తి యైన జూచియెరుంగనివాడు గావున తాను కొంచెము దూర మునకు తొలగి నిలచెను. శ్యాముని ముఖమును నొక సూరు తనివిదీర చూచుటతోడనే, సరసిజ శరీరమునుండి వేడి దిగజారి మెల్ల మెల్లన చల్లనగుచుండెను. డాక్టరుగా రౌష ధముల నిచ్చెదను రమ్మని బాబురావును దోడ్కొనిపోయెను. శ్యామసుందరుడు తనమిత్రుడగు బాబురావు వెంట సావడిలోనికి జనియెను. పిమ్మట సరసిజ కొకింత మనశ్శాంతి కలిగి పడకపై నుండి లేచి తనతల్లితో తిన్నతిన్నగ నడుగులిడుచు వంటగదికి జనెను.

ఒకింతతడవైనపిమ్మట సరసిజ 'చిరునగవుతో అమ్మా! ఆకలియగుచున్నది, నన్నము పెట్టు'మని యడిగెను. తన కొమ రిత ముఖలక్షణముల పరిశీలించి, యామె మనోభీష్టమును

గుర్తెరింగినదై మనమునం దమందానందము పొడమ 'సరసిజ! అన్నయ్య యౌషధములు దెచ్చిన యనంతరము భుజింతువు గాని; యింతలో నేమి తొందర'యని కమలమ్మ యోదార్చెను. 'అమ్మా! నాకు మిక్కుటముగ నాకలి యగుచున్నయది. ఇప్పుడు నాశరీరము కులాసాగానే యున్నది. ఇక నే నా యౌషధము నొల్ల'నని సరసిజ నుడువ తనగారంపుపట్టిపై జాలినొంది తన చెంత గూరుచుండ బెట్టుకొని కమలమ్మ తానును భోజనమునకు గూరుచుండెను.

కొంతతడవైన పిమ్మట బాబురావు యేవో యౌషధములు తీసికొనివచ్చి తన తల్లి చేతి కిచ్చెను. కాని యప్పటికప్పుడె సరసిజ స్వస్థతనొంది కొలదిగ భోజనము జేయుచుండుటజూచి బాబురావు సంతోషముతో శ్యామసుందరునివద్దకు జనియెను.

శ్యామసుందరుడు బాబురావునుగాంచి సరసిజ దేహ పరిస్థితులనుగూర్చి అడుగగా- 'జ్వరము తగ్గి భోజనము జేయుచున్న'దని బాబురావు జవాబుచెప్పెను. పిమ్మట శ్యామబాబులు అటనుండి బయలుదేరి యెటకో పయనమై పోయిరి.

## ౨

కామేశ్వరరావు ప్రతిదినము సూర్యోదయమున లేచి చద్దిగుడిచి, గొప్ప వ్యాపకునివలె నెక్కడకో పోవుచుండును. మరల ఇంటికి వెళ్ళి భోజనముచేయుటకైనను అతనికి తీరుబడి గాకుండెడిది. కామేశ్వరుడు వచ్చెనా లేదాయని యింట యనుకొనువారును లేరైరి. రామమూర్తిగారికి మాత్రము తన మేనల్లునియందు ప్రేమ మధికము. చిన్ననాటనే యాతని తల్లి

కాలధర్మము నొందుటచే రామమూర్తిగారు తమయింటనే కామేశ్వరుని నుంచుకొని పోషించుచుండిరి. కామేశ్వరుడు చదువు సంధ్యలు మాని బికారివలె దిరుగుచుండెను. జూదము, కోడెతనము అతనికి ముఖ్యకృత్యములయ్యెను. దుష్టసహవాసముచే నతడు సర్వవిధముల జెడిపోయెను.

కామేశ్వరుని నడవడియంతయు కమలాకరరావు గమనించుచునే యుండెను. కమలాకరు డప్పుడప్పుడు కామేశ్వరుని మందలించుచునే యుండెను. కమలాకరుని వచనములు కామేశ్వరుని మంచిదారికి ద్రిప్పగలవా? తననుజూచి లోకము పరిహసించునని కామేశ్వరుడు తలంచునా? అటు లెన్నటికిని కాజాలదు.

కమలాకరుడు బాబురావునకు స్నేహితుడు, సహాధ్యాయి. కాలేజికి సెలవులిచ్చిననాటగోలె బాబురా వెచ్చట నివసించు చుండినదియు కమలాకరరావునకు తెలియదు. కాని శ్యామబాబులు—యువజనసంఘము వృత్తాంతమును పత్రికలద్వారా తెలిసినప్పటినుండియును తనమిత్రుని గలిసికొన కమలాకరుడు ప్రయత్నించుచుండెను. తనమిత్రుని తండ్రిగారికి జబ్బుగానుండెనను వార్తనువిని కమలాకరుడు బాబురావుయింటికి జనియెను. బాబురావు తనబాల్యమిత్రుని గాంచి యపరిమితమగు సంతోషమున కమలాకరా! రమ్మని గౌరవించెను. అనంతరము తన యనుంగు చెలికాడగు శ్యామసుందరుని కమలాకరునకు పరిచయము గలిగించెను. అంత కమలాకరుడు తన మిత్రునితో బాబు! కాలేజికి సెలవులిచ్చినపిదప నీవు కాన్పించకుండుట నేను [illegible]. ఎచ్చటకు పోయియుంటివని యడిగెను.

బాబు విజయపుర వృత్తాంతమంతయు నాతని కెరింగించెను. కమలాకరుడు తన మిత్రుని యభిప్రాయములతో నేకీభవించెను. యువజనోద్యమమున జేరి తన మిత్రునితో గలసి దేశసేవ జేయ సంకల్పించెను.

ఒకనాటి సాయంసమయమున నామిత్రులు ముగ్గురు చల్లగాలికి షికారునకుజని వచ్చుచుండ మార్గమధ్యమున తమ్మిలేరు వంతెనకడ నెవరో కొందరు వ్యక్తులు త్రాగిన మత్తువలన తగవులాడుకొనుచుండిరి. ఆ త్రాగుబోతులు దారి కడ్డముగ నిలువంబడియుండుటచే మన మిత్రులట నొకి తకాలము నిలువవలసివచ్చెను. అప్పటి కప్పుడే చీకటి దట్టముగ నావరించియుండుటచే నావ్యక్తులెవరో గుర్తింప నలవిగాకుండెను. మనమిత్రుల కంఠధ్వనివిని ఆవ్యక్తు లచటనుండి తొలగిపోయిరి. కాని యాదారి కడ్డముగ నొకడు పడియుండుట గాంచి, అయ్యో! పాపము! మద్యపానముచే నొడలు తెలియక మానహీనుడై పడియుండెనేయని యామిత్రు లొకింత చింతాక్రాంతులై క్రిందబడియున్న వ్యక్తిని లేవనెత్తి కూర్చుండ బెట్టిరిగాని యాతడు కూర్చుండుట కశక్తుడయ్యెను. తూలిపడుచు నోట నురుగుగారుచుండ మనమిత్రు లావ్యక్తిని చేతులపై వైచుకొని రోడ్డుకడనున్న లాంతరు స్తంభముకడకు మోసుకొనిపోయిరి. ఆదీపము వెలుతురువలన నాతడెవరో యని పరిశీలింపసాగిరి.

ఆవ్యక్తిని బాబురావు కనులగాంచినంతనే యమితాశ్చర్యపడి దూరమునకుజని రామరామా! యని కనులు మూసుకొనెను. శ్యామసుందరుడు నిర్ఘాంతపడియెను. కమలాకరు డావ్యక్తిని

తన భుజములపై నిడికొని నడచుచుండ, బాబురావాతనిని గాంచి కమలాకరా! ఆదుష్టుని నట విడిచివేయుము. ఆ నీచుని తాకిన మహాపాతకములు జుట్టుకొనునని గద్గదస్వరమున నుడివెను. అందులకు కమలాకరు డొకింత శంకించుచుండ తిరిగి బాబురావు తన మిత్రునిజూచి- యాతని మనము ముట్టజనదు. ఆ కులహీనుడు వంశమున కంతకు నపకీర్తి నిదెచ్చెను. నీవు నాతని నచ్చటనే పడవేసిరమ్ము. స్పృహ తెలిసినపిదప నాతడే లేచి రాగలడు, నీ వాతని విడిచిరాకున్న లోకము మనలను పరిహసించునుసుమా ! యని కమలాకరుని మందలించెను.

అంతట కమలాకరు డా ప్రక్కనుండిన నొక ఇంటి యరుగుపై నాతని పరుండబెట్టి తనమిత్రులనుజేరి ఇంటికిపయనమై పోయెను. పిమ్మట కొంతకాల మటనే పరుండి యెట్టకేలకు నాత్రాగుబోతు స్పృహ తెచ్చుకొని యొడలు దులుపుకొనుచు గృహాభిముఖుడై పోవుచుండెను. ఆవ్యక్తి యెవరు? ఆతడే కామేశ్వరరావు. అతడు గృహమునకు పోవునప్పటికి రాత్రి పది గంటలయ్యెను. ఇంటిలోనివారెల్లరు భుజించి పరుండియుండిరి. కమలమ్మమాత్రము యింకను పరుండియుండలేదు. కామేశ్వరుడు మెల్లమెల్లన వీధితలుపు తెరచి తన గదిలోనికి జనుచుండుట కమలమ్మచూచి, కామేశ్వరరావూ! నేడు నీరాక కేల చాల ప్రొద్దుపోయినదని ప్రశ్నింప, కామేశ్వరు డేమియు ప్రత్యుత్తర మీయక మిన్నకుండెను. భోజనమువలదా యని యడుగనా కాకలి యగుటలేదు- ఒడలంతయు బడలికగా నున్నదని నుడువుచు కామేశ్వరుడు తన శయనగృహమువైపునకు జనెను. కమలమ్మ కేలనో కామేశ్వరు డనిన నసహ్యముగ దోచుచుం

డెపిది. కాని యానాటి కామేశ్వరుని చరిత్ర మామెకు తెలియదు. శ్యామబాబులకు తన దురాచరణము తెలియునని కామేశ్వరునికి తెలియదు. తన నెవరైన జూచి బాబురావుకు తెలుపుదు రేమోయని మాత్ర మప్పుడప్పుడు కామేశ్వరుడు భీతిలుచుండెను. శ్యామబాబులు నిదుర జెందక కామేశ్వరుని రాకను గాంచుచునేయుండిరి. కామేశ్వరుని దుస్థితినిగూర్చి విచారించి వారు నిదురజెందునప్పటికి యర్ధరాత్రి యయ్యెను.

ఆమరునా డుదయమున కామేశ్వరుడు పెందలకడనే లేచి శ్యామబాబులు నిద్రనుండి మేల్కాంచకపూర్వమే చద్ది గుడిచి యింటినుండి వెడలి యెచ్చటికో పోయెను. శ్యామబాబులు నిద్రమేల్కాంచి కాలకృత్యముల నిర్వర్తించుకొని యెటకో పయనమై వెడలబోవుచుండ, కమలాకరు డరుదెంచి నేడు మాగృహమున కల్పాహారమునకు దయచేయవలయునని వారలను దోడ్కొనిపోయెను. చిన్నతనమునుండియు కమలాకరుని గృహమునందు బాబురావు చాల చనువుగ మెలగుచుండెడివాడు. ఆ కారణమున కమలాకరుని తలిదండ్రులు బాబూరావును బాబూ! యని పిలుచుచుందురు. కొంతకాలమునుండి బాబురావు చెన్ననగరమున విద్యనభ్యసించుచుండుటచే నీ మధ్య యంతగా వచ్చుచు పోవుచునుండ వీలుగలిగినదిగాదు. కొలదికాలముక్రిందట జూచిన సరళ యిప్పుడొకింత వయసు వచ్చినదగుటచే నామెను తనచెంతకుబిలువ బాబురావు శంకించెను. లేబ్రాయము చెల్లి వయసుచేకూరి వివాహయోగ్యయైన సరళ బాబురావు దృష్టిపథమున బడుటతోడనే, పసితనముకంటె నిప్పుడు వయసుతోగూడ బెరిగిన యామె సౌందర్యమున

కచ్చెరువందుచు, తనమిత్రుడగు కమలాకరునితో - ఏమోయి! ఆమె నీసోదరియగు సరళయేనా ? యని ప్రశ్నించెను.

అవును. నీకెంతలో మరపునకువచ్చినదని కమలాకరుడనియెను. లేదు, నేను పూర్వము చూచినప్పటికంటె యిప్పు డెంతయో మారిపోయినదిసుమా! యని బాబురా వాశ్చర్యముతో నుడువ, సరళ లజ్జాక్రాంతయై యచ్చటినుండి బయలుదేరి పడమటింటి ద్వారముకడ నిలచి బాబురావును తొంగి తొంగి చూచుచుండెను.

చిరుతప్రాయముకంటె వయసువచ్చినకొలదిని కన్యలకు సౌందర్య మతిశయించుట స్వభావసిద్ధముగదా! సరళ పండ్రెండు వత్సరముల వయసుగలకన్య రూపురేఖావిలాసము లతీతములు. సరసిజ సౌందర్యాతిశయములకు సరళ యెంతమాత్రము దీసిపోవునదిగాదు.

తన చెలియలను బాబురావునకిచ్చి పరిణయ మొనర్పవలెనని కమలాకరునికి మొదటినుండియు కుతూహలము కలదు. కాని తండ్రియగు మురళీధరశర్మగారికి మాత్రము రామమూర్తిగారు సంఘ సంస్కర్తలనియు, అట్టివారితో సంబంధ బాంధవ్యము లొనర్చుకొనుట శ్రేయస్కరముగాదనియు తలచుచుండిరి. కాని బాబురావు యోగ్యతలకుమాత్రము మురళీధరశర్మగారు మిక్కిలి సంతసించుచుండిరి. సరళ తల్లియగు శ్యామలాంబ తనకొమరితను బాబురావునకిచ్చుటకు మొదట సమ్మతింపకపోయినను, కమలాకరుని ప్రోత్సాహము వలన యిప్పుడు బాబురావున కిచ్చుటకే నిశ్చయించుకొని, తన భర్తతో నాతని గుణగణములనుగ్గడించి యాతనికి సరళ నివ్వ

వలయునని చెప్పుచుండెడిది. ఎన్ని సంబంధములు వచ్చుచున్నను సుముఖులుగాక తల్లి కొమరులు యేదోవిధముగ నభ్యంతరములను జెప్పుచుండెడివారు. ఆకారణమున మురళీధరశర్మగారి ప్రయత్నములు వ్యర్థములగుచుండెడివి. అందువలన నింతవరకును సరళ కెచ్చటను సంబంధము నిశ్చయింపబడి యుండలేదు. శ్యామలాంబ ఫలహారముల దీసికొనివచ్చి మన మిత్రబృందము యెదుటనుంచి బాబురావునుజూచి- బాబూ ! మీ నాన్నగా రారోగ్యముగ నున్నారా? యని పలుకరించెను.

అంత బాబురావు యామెతో తన తండ్రిగా రారోగ్యముగానేయున్నారని సమాధానమిచ్చెను. శ్యామబాబులు కమలాకరునితో గలసి ఫలాహారముల నారగించి, యటనుండి పయనమై టవునుహాలు వైపునకుజనిరి.

ఆనాటి సాయంకాలమున జాతీయవిద్యాలయావరణమున యువజనమహాసభ జరుగునని కమలాకరుడు కరపత్రములను బ్రచురించెను. యువజను లనేకు లాసభ కరుదెంచుచుండిరి. సభాప్రదేశమంతయు ప్రేక్షకులతో గ్రిక్కిరిసి యుండెను. అందు స్త్రీలు సయితము పెక్కండ్రుగలరు. కమలమ్మ గృహకృత్యముల దీర్చికొని తన కొమరితెయగు సరసిజతో నా సభ కరుదెంచెను. అంతకుమున్నే స్త్రీల ప్రత్యేకస్థలమున గూర్చుండియుండిన శ్యామలాంబ కమలమ్మగారి రాకనుగాంచి తమప్రక్కన గూర్చుండుట కాహ్వానించెను. ఇంతలో సభాకార్యక్రమము ప్రారంభింపబడెను. ఆనాటి సభాకార్యక్రమమునుగూర్చియు, తనమిత్రుడగు శ్యామసుందరుని గురించియు,

సభికుల కౌతుకపరచుచు కమలాకరు డొకింతతడవు ముచ్చ టించెను.

నాటిసభకు శ్యామసుందరు డధ్యక్షుడుగా నుండవలయు నని సభికులచే కోరబడెను. ప్రేక్షకులు జయజయధ్వను లొనరింప శ్యామసుందరు డధ్యక్షపీఠము నలంకరించి మహోపన్యాసము చేసెను.

పిమ్మట మరికొందరు వ్యక్తు లుపన్యసించిరి పిదప ప్రేక్షకులలో అత్యుత్సాహము చెలరేగ జయజయధ్వానులతో సభ ముగియునప్పటికి రాత్రి యెనిమిదిగంటలయ్యెను.

ఇంటికడ రామమూర్తిగారు తనభార్యాబిడ్డ లింకను రాలేదని యెదురుచూచుచుండిరి. కమలమ్మ తమ కొమరుని వలన బండి తెప్పించుకొని, సరసిజతో గృహమునకుబోవ బయనమగుచుండెను. శ్యామసుందరు డుపన్యాస వేదికవద్దనుండి వెలుపలకువచ్చి తనమిత్రులతో సంభాషింపుచు నిలువంబడి యుండెను. సరసిజ యానందపరవశయై, నయనగోళములనుండి యానందబాష్పములురాల, సుందరునియెడ ప్రేమ మతిశయించి, యాతనిని తదేకదీక్షతో గాంచుచు, చిరునగవున, 'అమ్మా! ఇంటికి వెళ్లుదమా?' యనెను. కామేశ్వరుడు తన మిత్రబృందముతో నట నిలువబడి, యేదియో యాలోచించుచుండెను. కమలాకరు డా విషయమునుగాంచి, తన మిత్రులకు వారలను చూపెట్టుచుండెను. సరళ బాబుగారిను క్రీగంట చూచుచు తన తల్లితో నింటికి పయనమై పోవుచుండెను.

కామేశ్వరుడు గతరాత్రి తన విషయమును శ్యాము బాబులు చూచియుందురాయనియు, శ్యామసుందరుడు తన

యుపన్యాసమున సంగ్రహముగ నుడివినవిషయములు తన్ను గూర్చియే యైయుండునాయనియు పరిపరివిధములుగ నాలోచించుకొనుచు, మనము కలతవడ, శ్యామబాబులు రాక మున్నే యింటికివచ్చి చేరెను. కమలమ్మ తన కొమరితతో బండిదిగి యింటిలోనికి జనియెను. శ్యామబాబులు కమలాకరునితోను, యితర మిత్రులతోను సెలవుగైకొని యింటికి జేరునప్పటికి సుమారు తొమ్మిదిగంటలయ్యెను.

మన మిత్రుల రాకనుగాంచి సరసిజ వేవేగమున నుష్ణోదకము నాయత్తపరచెను. శ్యామబాబులు స్నానమాచరించి, పరిశుభ్రమగు దుస్తులనుధరించి, భోజనశాలకు జనిరి. కమలమ్మ కామేశ్వరుని భోజనమునకు రమ్మనమని పిలువ, పిదప వత్తుననియెను. రామమూర్తిగారు మెల్లన నాభోజనశాల కడకు వచ్చి యట కూరుచుండి నాటి సభావిశేషములను తెలుసుకొనుచుండెను. రామమూర్తిగారి సంశయములనెల్ల శ్యామసుందరుడు తీర్చుచుండెను. తలుపుచాటున నిలువబడి యున్న సరసిజ యీ సంభాషణములనాలించుచు, "నాన్నా! యిప్పుడైనను మీసందేహములు తీరెనా?" యని ముద్దులొలుకు పలుకులతో నుడివెను.

శ్యామసుందరుని ధైర్యసాహసములకును, ఆతని యోగ్యతలకును, అత్యద్భుతమగు నాతని మేధాశక్తికిని, మిక్కిలి యాశ్చర్యపడుచు, నిదివరలో నాసందేహములనుతీర్ప నేరికిని తరము గాకుండెసిది. ఇప్పుడు నా సందేహములన్నియు పటాపంచలయిపోయెను. తమదర్శనభాగ్యముచే నేనెంతయు ధన్యుడనయితిని. రేపే స్వదేశీదీక్షగైకొందునని ప్రతిజ్ఞనొనర్చి, తన పుత్రుసి

గాంచి- "ఒరే బాబూ! రేపుదయముననే నాకు కద్దరు వస్త్రములను గొనితెమ్మ"ని రామమూర్తిగా రత్యుత్సాహమున నుడివిరి. ఆవలిప్రక్కనే నిలువబడియుండిన సరసిజ తన తండ్రిగారి ధీరవచనములకు మిక్కిలి యుప్పొంగి తన తండ్రినిగూర్చి- 'నాన్నా! మరి నాకో!' యని మందహాసవదనారవిందయై నుడివెను. 'అమ్మా! అటులనే తెప్పించెద'ననుచు సరసిజకును, తన భార్యయగు కమలమ్మకును వలసిన కద్దరువస్త్రముల దీసికొని రావలసినదని రామమూర్తిగారు తనకొమరుని కానతిచ్చిరి.

పిమ్మట తనమేనల్లుడు కామేశ్వరరావు వచ్చుట లేని కారణమున, నేడు కామేశ్వరుడు కనుపింపలేదేమని రామమూర్తిగారడిగిరి. నావలివైపున గోడచాటుననుండి ఈవిషయముల నెల్ల నాలకించుచుండిన కామేశ్వరుడు బిరబిరజని తనగదియందు పరుండెను. అంతట కమలమ్మ- "నేనే మెరుగుదును. భోజనమునకు రమ్మనిన రాకపోయెను. ఆవల భుజించును గాబోలు"నని నుడువుచున్నంతలో, "నటులగాదు. ఇంతెదనుక నాగోడచాటున నిలుచుండె గాబోలు. నాన్నగారిమాట లాలించినంతనే త్వరితగమనమున తనగదిలోనికి బోవుచుండె"నని సరసిజ నుడివెను.

ఆసుదతి పలుకులు విని శ్యామబాబు లిరువురు తమలో తాము నవ్వుకొనిరి. రామమూర్తిగారి కొకింత నీరసముగ నుండుటచే నటనుండి లేచి తమ పడకగదిలోనికిజనిరి.

భోజనానంతరమున బాబురావు ముందునడువ, శ్యామసుందరుడు వెనుకనుండి వచ్చుచున్నంతలో సరసిజ గాంచి, తనలో తానిటుల నాలోచింపదొడగెను.

"ఈసౌందర్యరాశిని గాంచినప్పటినుండియు నామన మానందతరంగములచే పొంగిపోవుచున్నయది. నా స్త్రీజన్మము సార్థక్యము నొందవలెనన, నీ సుగుణమూర్తినే భర్తగాబడయ వలయును. దుష్టుడగు కామేశ్వరుని జెట్టబట్టుట యిహపరము లకు దూరమగుటయే. నామనమప్పుడే యాప్రేమమూర్తినే యెన్నిజన్మలకైనను ప్రాణనాథునిగా ననుగ్రహింపవలసినదని పరమాత్మ నంజలిబద్ధనై వేడుచున్నదానను. అట్టి యవకాశ మీజన్మమున లభింపకపోయెనేని నోరిమితో నామహామహుని జేపట్ట నెన్నిజన్మములనైన నెత్త గోరుచున్నదానను." అని నిశ్చయించుకొనుచుండెను.

శ్యామసుందరుడు భోజనశాలనుండి సావడిలోనికి జను చుండినప్పుడు సరసిజ గదిద్వారమువద్ద నిలువబడి యుండు టయు, సరసిజ శ్యామసుందరుని క్రీగంటజూచి యేదియో దీర్ఘా లోచన మొనరించుచుండుటయు, కామేశ్వరుడుగాంచి, కోపా విష్టుడై, తీక్ష్ణములగు దృష్టులతో, సరసిజను చురచురజూచుచు నటనుండి భోజనశాలకుజనెను.

సరసిజ కామేశ్వరుని క్రూరములగు చూపుల కొకింత భీతిల్లి గదిలోనికి జనియెను. శ్యామబాబు లోకింత తడవు తాంబూలచర్వణ మొనర్చుకొనుచు యుద్యమప్రచార విషయ ములగూర్చి ముచ్చటించుకొని, యావల పరుండనేగిరి.

## ౩

ఆరాత్రి సరసిజకు నిద్రపట్టలేదు. తన ప్రియతముని గాంచినప్పటినుండియు, నాతనితో మాటలాడవలయునను కుతూ హలము రెట్టింప, నేమియుదోపక యాలోచింప సాగెను.

భోజనానంతరమున నాపుందరాకారుని గాంచినప్పుడు తన హృదయమునందు గలిగిన వివిధములగు మార్పులును, అనంతరము తానొనర్చుకొనిన నిశ్చితాభిప్రాయములును, తలంపునకువచ్చి యేమియు దోపక విచారనిమగ్నుడై యుండెను. తన మనో నిశ్చయమును శ్యామసుందరుని కెరిగింపవలెనను తలంపు గలిగెనుగాని, యాత డేమనుకొనునోయని యెడతెఱపి లేని యాలోచనము లావరింప, నెట్టకేలకు నిదుర జెందెను.

ఇట శ్యామసుందరునికి నిదురరాక, యటునిటు బొరలుచు, నానాటికి తీవ్రరూపమును దాల్చుచున్న యుద్యమవిషయములు తలంపునకువచ్చి, యంతకుమున్ను బాబురావుతో ముచ్చటించిన విషయములు జ్ఞాపకమునకురాగా, కార్యసాధనమునకై మార్గము లాలోచించుచు నిదురించెను.

వేరొకవైపున కామేశ్వరుడు కపటమనస్కుడై నిదుర రాక, పడకపై గూరుచుండి, తీవ్రాలోచనాపరుడై, సరి, వీనిపని బట్టెదగాక. సరసిజను నాకిచ్చి వివాహముజేయ నామేనమామ సంకల్పించియుండెనుగదా ! నామామగారికి నాపై యనురాగముమెండు. ఇతరులు నాయెడల నెటుల ప్రవర్తించిననేమి? చిన్ననాటనుండి సరసిజను నే ప్రేమించియుంటిని. ఆమెయు నాయందు మిక్కిలి మక్కువగనుండెడిది. ఒండొరులము పరస్పరానురాగులమై యుండువారము. నాబావమరది బాబురావాదుష్టుని నింటజేర్చి, యిట్టి యిక్కట్టులను దెచ్చిపెట్టినాడు. నేను భోజనశాలకు జనుచున్నప్పుడా శ్యామసుందరుడు సరసిజనుగాంచి. మాటలాడినటు లుండెను. సరసిజయు నచ్చటనే నిలువబడియుండెను. సరసిజ యాతనితో మాటలాడియుండునా?

లేకేమి? ఒకప్పుడు సరసిజ యాశ్యామునిగూర్చి తన చెలికత్తియలతో ప్రశంసించుచుండుటను వింటిని. శ్యామునితోగూడ సరసిజ సరసోక్తులాడియే యుండును. నారాకనుగాంచి యామె యావలిప్రక్కకు జనియుండనోవు. కానిమ్ము. త్వరపడిన ప్రయోజనమేమి? యని తనలోతాను వితర్కించుకొనుచు నిదుర జెందునప్పటికి నిశీథమయ్యెను.

కమలమ్మ శ్యామసుందరుని యుపన్యాససంగ్రహమును స్మరణకు తెచ్చుకొని, యాతని పలుకుల కచ్చెరువందుచు, నాటి నాయంసమయమున త్రాగి యొడలెరుంగక పడియుండిన బ్రాహ్మణయువకు డెవడై యుండును? ఆ నాడుదయముననే చద్ది గుడిచి యిలువెడలిన కామేశ్వరుడు రాత్రి చాల ప్రొద్దుపోయి వచ్చుటయు, శరీరము బడలికగా నున్నదని భుజింపకయే పండుకొనుటయు జూడ నాకేలనో మిక్కిలి యనుమానము వొడముచున్నయది.

ఆతడు నేడుగూడ శ్యామబాబులతో భోజనమునకు రాక పిమ్మట వచ్చి భుజింతునని నుడువుటయు నాయనుమానమును మిక్కిలి ధృవపరచుచున్నయది. ఈనడుమ కామేశ్వరుని నడవడిక యంతయు విపరీతముగ గన్పట్టుచున్నయది. ఆకారణమున నాయనుమాన మేలనో కామేశ్వరునిపైననే గలదు. ఆ బ్రాహ్మణయువకుడే యీకామేశ్వరు డని నామనంబు నిశ్చయమొనర్చుచున్నది యని యేమేమో యాలోచించుకొనుచు నిదుర జెందెను.

ఈవైపున బాబురావుకు నాటి సభావిశేషములును, తన తండ్రిగారి కార్యదీక్షయు, కామేశ్వరుని చిత్ర చారిత్ర

మును జ్ఞాపకమునకువచ్చి యీవిధముగా నాలోచింప వొడం గెను. కామేశ్వరుడు ఇట్టి హీనస్థితికివచ్చునని నే నెన్నడును తలంపలేదు. కాని యాతని గుణగణములు మాత్రము నే నెరుంగకపోలేదు. నాసోదరిని ఆముష్మున కిచ్చుటకు మాతండ్రిగా రుద్దేశించుచుండిరిగాని నేనట్టుల సమ్మతింపజాలను. నాచెలియలు యిట్టి త్రాగుబోతును వరింపజాలదు.

నామిత్రుడగు శ్యామసుందరునిపై ఆమెకు గాఢానురాగముగలదని యింతకుమున్నే గ్రహింపగల్గితిని. యోగ్యుడును, దేశభక్తుడును, విద్యాధికుడును, నగు శ్యామసుందరు నకే నాసోదరి నిచ్చి పరిణయమొనర్ప ప్రయత్నించెదను. మా తల్లిగారు నామాట మీరిపోవదు. ఆయమకును కామేశ్వరు డన్న పరమాసహ్యము. మఱ్ఱి విడనాడి మాతండ్రిగారు నా చెలియలను ఆముష్మున కిచ్చి యట్టుల వివాహ మొనర్పగలరో చూచెదగాక! అందునయభిమత మెన్నటికిని నెరవేరజాలదు.

పెద్దలమాట మీఱరాదను నార్యోక్తి యిట్టి విషయములందు వర్తింపజాలదు. కాని శ్యాముని తండ్రిగారు పూర్వాచారపరాయణులుగదా! అట్టియెడ శ్యాముని యభిప్రాయ మేమూ గమనింపవలసియున్నది. నే నీ విషయమును శ్యాము నితో సమయానుకూలముగ ప్రస్తావించెదనుగాక యని యనుకొనుచు బయుండెను.

మఱునాటి యుదయమున శ్యామ్, బాబులు తన మిత్రుడగు కమలాకరునితో యుద్యమ ప్రచార మొనర్ప బయలు దేరిరి. "దేశమునందు స్వాతంత్ర్యోద్యమము దినదినాభివృద్ధిని గాంచుచుండెను. పురుషులును, స్త్రీలును పెక్కండ్రు యువ

జనసంఘసభ్యు లగుచుండిరి. ప్రజలు వేనవేలుగ శాంతిసైన్యమున జేరుచుండిరి. మద్యవిక్రయశాలలు మూలబడుచుండెను.

వర్తకులు తమవ్యాపారములు కట్టిపెట్టి కట్టుబాట్లొనరించుకొనుచుండిరి. కులకటులు సద్దుమణుగుచుండెను. నాయకులు శంఖనాదముల పూరింప మొదలిడిరి. బహిష్కారాస్త్రము విదేశవర్తకమును ఢీకొనుచుండెను. రాట్నచక్రము సుదర్శనచక్రమై విదేశయంత్రములను తుత్తునియలుగ జెండాడుచుండెను. ప్రజలు క్రూరశాసనములను సహించలేక తిరస్కరించుచుండిరి. దేశములో నెచ్చటజూచినను యపరిమిత కోలాహలము చెలరేగుచుండెను.

పాలకవర్గమువారు నాయకులను బంధించి కారాగారముల కంపుచుండిరి. శాంతియోధులు రణరంగమున తుపాకి తెండములుగ దుమికి యాహుతి యగుచుండిరి. యువకులు విజయభేరిని ప్రమోగింప గడంగిరి. దేశములో దశదిశల స్వాతంత్ర్యోద్యమమునకు విజయసూచనలు కనుబడ జొచ్చెను.

రణరంగమున జిక్కిన అహింసాపరులగు శాంతిసైనికుల బంధించి కారాగృహములందు త్రోయుచుండిరి. స్త్రీలను సహితము చెఱబెట్టి వెఱువకుండిరి. స్త్రీపురుషులను వివక్షతలేక యెల్లరను కఱ్ఱలచే మోదుచుండిరి. బుధులు సైతము కఠిన విధానమునకు గురియగుచుండిరి. అన్యాయముగ ప్రజలను బాధింపుచుండుటచే దేశమునందు స్వాతంత్ర్యేచ్ఛ దినదినాభివృద్ధి నొందుచుండెను. శాంతిసైనికులు వేనకువేలుగ కారాగృహములను నింపుచుండిరి. పాలకవర్గమున కిసుమంతయైన విశ్రాంతి లేదయ్యెను. నిర్బంధవిధానమునకు ప్రజ లేమాత్ర

మును లొంగకుండిరి.'' యని శ్యామసుందరునికి వార్తలనే కము లేతెంచుచుండెను.

ఇట్టి స్థితిలో, బాబురావు ప్రేరేపణవలనను, రామమూర్తిగారి యనుమతివలనను, కమలమ్మ, సరసిజ స్వాతంత్ర్యోద్యమమున పాల్గొనుచుయుండిరి. వృద్ధులగు రామమూర్తిగారు ఖద్దరు ప్రచారమునకు గడంగిరి. కమలమ్మ రాజకీయవాతావరణమును గుర్తెరింగి స్త్రీలోకమున నిరంతరము ప్రబోధము గావించుచుండెను. సరసిజ తనస్నేహితురాండ్రను యువజన సంఘమున జేర్చుచుండెను. కమలాకరుని హేలాపుర ప్రాంతముననే ప్రచారమొనర్పుమని నియమించి శ్యామబాబులు రాష్ట్రమున నలుదిశల ప్రచారము నొనర్చుచుండిరి.

విజయపురమున సదాశివయ్యగారు తమకొమరుని రాకకై యెదురుచూచుచుండిరి. శ్యామసుందరుడు యువజన సంఘమున జేరెననువార్త వినిననాటనుండి మిక్కిలి యాందోళనమును జెందుచుండిరి. తాను రాజభక్తిపరు డగుటజేసి తన కొమరునిగూర్చి పాలకులవలన తనకేమి ముప్పువాటిల్లునోయను భీతియు, తన యేకైకపుత్రుడగు శ్యామునకు ఎట్టి యిక్కట్టులు వాటిల్లునోయను చింతయు, సదాశివయ్యగారిని నిరంతరము బాధించుచుండెను.

ఇచ్చట సరసిజ తన మనోహరుని ప్రచారకార్యక్రమమును విని యాతని కనుల వీక్షించుట కవకాశము లభింపదను చింతయు, శాంతిసంగ్రామమున తన ప్రియుడు ధీరుడై ప్రతిపక్షుల డీకొని విజయలక్ష్మిని చేపట్టగలడను సంతసమును మక్కిలిగ పొందెను.

అట కామేశ్వరుడు మిత్రచతుష్టయముతో కుట్రాలో
చనముల సలిపి తన వైరియగు శ్యామసుందరుని బరిమార్ప
మార్గముల బన్నుచుండెను.

సంపూర్ణారోగ్యముగలవారైన యనంతరము రామ
మూర్తిగారు తమ కొమరితకు పరిణయమొనర్ప నాలోచించు
చుండిరి.

ఇటు లొకింతకాలము గడువ, తమకొమరుడు విజయ
పురికి గాని కారణమున సదాశివయ్యగారు రామమూర్తిగారి
కొక లేఖ వ్రాసిరి. అందు తాను చిక్కులకు లోనై తిననియు,
శీఘ్రమే శ్యామసుందరు నిటకు బంపుడనియు వ్రాయబడి
యుండెను. శ్యామ, బాబు లుద్యమప్రచారమున నిమగ్నులరై
యుండుటచే నేమాత్రమును తీరుబడి లేకుండెను. ఎట్టకేలకు
రామమూర్తిగా రా యుత్తరమును శ్యామసుందరున కంద
జేసిరి. ఆ లేఖను వీక్షించినంతనే శ్యాముడు బాబురావునుజూచి
మిత్రమా! నేను ప్రస్తుతము విజయపురమునకు వెడలవలసిన
యవసరము సంభవించినది. నేను వచ్చి చాలాకాల మగుటచే
మానాన్నగారు నన్నటకురమ్మని లేఖ వ్రాసిరి. ఇప్పటి మన
సంచార కార్యక్రమ మొకింత మార్పుగావింపుమని నుడువుచు
తనతండ్రిగారి వద్దనుండి వచ్చిన యుత్తరమును జూపెట్టెను.
బాబురావు కొంతతడ వాలోచించి వల్లెయని కార్యక్రమపట్టి
కను మార్పుగావించెను.

శ్యామసుందరునితో తానుగూడ విజయపురికి వెడలు
సంకల్పముతో గాబోలు శ్యామునిగూర్చి మిత్రమా! మనము
హేలాపురమునకుబోయి యచ్చట మానాన్నగారివద్ద సెలవు

గైకొని యనంతరము విజయపురికి వెడలుదము అని నుడివెను. శ్యామసుందరు డందుల కంగీకరించి తన మిత్రునితో యట నుండి బయలుదేరి యాసాయంసమయమున కామిత్రులు హేలాపురి జేరవచ్చిరి.

మరునాటి యుదయమున శ్యామబాబులు కమలాకరునితో సావడియందు గూరుచుండి యుద్యమవిషయములను గూర్చి ముచ్చటించుచుండిరి. ఆ సందర్భమున బాబురావు తన సోదరినిగూర్చి ముచ్చటించుచు నామె యొనరించుచున్న ప్రచారవిషయములను శ్యామసుందరునికి తెలియజేయుచుండెను. ఇంతలో సరసిజ యేదియో పనిపై ఆ సావడివైపునకు వచ్చుచుండుటను బాబురావుచూచి 'సరసిజా! యిటు రమ్మ'ని బిలువ నాసుందరి బాబురావుపిలుపు నాలకించి యత్యానందమున పైటచెఱగు సవరించుకొనుచు ఖద్దరు వస్త్రాలంకృతయై మెల్ల మెల్లనవచ్చి తనయన్నగారి ప్రక్కన నిలువబడి యుండెను. సరసిజ మిగుల అందమయిన సుదతి. సంగీతసాహిత్యములందు ప్రవీణతయు, హూణవిద్యానైపుణ్యమును గలదియై యుండెను.

బాబు:—శ్యామా! మనము ప్రచారమునకు వెడలినప్పటినుండియు మా సరసిజగూడ యువజనసంఘప్రచారమునకై పాటుబడుచున్నయది.

శ్యా:—అటులనా? స్త్రీలు సయితము మిక్కిలి త్సాహపూరితలై ప్రచారకార్యమును చేపట్టుట సంతోషప్రదము. ఈయమ యేయేపను లొనర్చినది?

బా:—ఆ వివరము లన్నియు నాకును అంతగా తెలియనేరవు. ఆమెనే యడుగవలసియున్నది. కాన నామెనే యడుగుము.

శ్యా:—అమ్మాయి! నీవు యెచ్చటిచ్చట ప్రచారమునకు వెడలి యుంటివి ?

అంత, సరసిజ కొకింత సిగ్గు, భయము వొడమి, యేమియు మాటాడక మిన్నకుండెను.

కమలా:—అమ్మా! సరసిజ! ఏమి? పలుకక యూరకుంటివి? నీ వొనరించిన పనినిగూర్చి తెలుపుట కేమి భయము? వారు మన సంఘమున కధ్యక్షులుగదా! నీ వెంతవరకు ఇటుల నిలచియుండెదవు. ఈ యాసనమున గూర్చుండి తరువాత సమాధానములు చెప్పుము.

సర:—అయ్యా! నేనీ పురముననే ప్రచార మొనరించుచుంటిని. స్త్రీ ఐచ్ఛికభటులను సమకూర్చి ఖద్దరు వస్త్రముల నమ్ముట, మధ్యనిషేధప్రబోధముగావించుట మున్నగు నిర్మాణకార్యక్రమమును నెరవేర్చుచుంటిని.

శ్యా:—అమ్మా! చక్కనిపని జేసితిరి. సంతసము.

ప్రథమమున అమ్మాయి! యనుటయు, మరల యిప్పుడు అమ్మా! యని సంబోధించుటయు సరసిజ మన మొకింత కలతవడి 'యిదియేమి! నే నొకటిదలచిన దైవము మరియొకటి తలుచుచున్నట్లున్నయది. నేను ఈసుందరునే ప్రేమించుచుంటిని. ఈ మోహనాకారుడు నన్ను ప్రేమింపడేమో? నా ప్రయత్నములు సఫలమగునో లేదో? నాయభీష్టము నెరవేరదో? ఈ

యన విషయమే వేఱుగా గన్పట్టుచున్నయది. ఏమిచేయు దును దైవమా!' యని యాలోచనతో యొకింతతడ వూరకుని 'ఆ! ఏమి నావెఱ్ఱి! యింతమాత్రముననే నేనిట్టి యాలోచనలకు చోటిచ్చుట యసమంజసము. అయినను ప్రస్తుత మీవిషయము నెరవేరవలయునుగదా!' యని తనలో తలపోయుచుండెను.

శ్యామసుందరు డత్యానందభరితుడై "అమ్మాయి! స్త్రీలు తమధైర్యసాహసము లీ విధమున సద్వినియోగ మొనర్చు నెడల భారతమాత త్వరితముననే దాస్యవిముక్తినొంది సర్వసంపదలతో తన సంతానమును పోషించుకొనుననుట నిస్సంశయము. చిరుతప్రాయముననే నీవిట్టి ఘనకార్యము నొనర్ప గలుగుటవలన స్త్రీలోకముననే గాక పురుషులకు సయితము గుణపాఠమును నేర్పగలిగితివి. ఇటులనే దేశసేవ చేయుటకు భగవానుడు తగిన యాయురారోగ్యములను, ధైర్య సాహసములను నీకు ప్రసాదించును గాక!" అనెను.

బాబు:—శ్యామా! యీకార్యదీక్షయంతయు నీయందలి తేజమువలనను, సదాచరణమువలనను, ప్రబోధము వలనను గలిగినది. నేనును, మాకుటుంబమును నీవల ననే పవిత్రమై దేశసేవానిరతిని బడయ గలిగితిమి.

కమలా:—బాబూ! నీవేకాక నేనుకూడ శ్యామసుందరుని వలననే దేశసేవజేయు భాగ్యమును స్వీకరింపగలిగితిని. అందులకు శ్యామసుందరునకు నేనెంతయు కృతజ్ఞుడను.

ఇంతలో రామమూర్తిగారు స్నానసంధ్యానుష్ఠానములను దీర్చికొని, భోజనశాలకు జనుచు సావడిలోనుండిన మిత్రు

లను, ఆవల మరియొకగదిలో నుండిన తన మేనల్లుడగు కామే శ్వరరావును భోజనమునకు రమ్మనమని పిలిచి వెళ్లెను.

కృష్ణార్జునులవలె శ్యామబాబులు తమ మిత్రుడగు కమలాకరునితో భోజనశాలకు జనుచున్న సమయమున క్రూరసేనునివలె కామేశ్వరు డోరచూపుతో వెనువెంటనే వచ్చుచునట నిలువబడియున్న సరసిజనుగాంచి కోపదృష్టితో చురచుర జూచుచు బోయెను. కమలమ్మ యానలుగురమోముల దిలకింపుచు వంటగదిగుమ్మముకడ నిలువబడియుండెను. అనంతరము కమలమ్మ వడ్డనగావించి యావలివైపున నిలువబడియుండెను. సరసిజ తనగదిగుమ్మముపీడి భోజనశాలవైపునకుజని యచ్చట నొకగోడచాటున నిలువబడి వారల సంభాషణములను వినుచుండెను.

శ్యామసుందరుడు తన కిరువైపుల గూరుచుండియుండిన బాబు కమలాకరులతోడను, తన కభిముఖముగా గూరుచుండియుండిన రామమూర్తిగారితోడను ఏదియో సంభాషణమును ప్రారంభించెను. ఆవలివైపున గూరుచుండియుండిన కామేశ్వరరావు నేలచూపులతో శ్యామునిముఖమును చూచుచుండెను.

ఆగదిద్వారము ప్రక్కనసుండు గోడచాటుననుండి ప్రేమపుష్పములను వెదజల్లుచున్నదోయన జూచుచుండిన సరసిజను శ్యామసుందరుడు గాంచి మిన్నకుండెను. కమలమ్మ యాయువకుల ముఖలక్షణముల గమనింపుచు నేలనో పరధ్యానచిత్తయైయున్న సమయమున రామమూర్తిగారు తన కొమరిత వివాహవిషయమై ప్రస్తావించుటను గ్రహించి ఆమె శ్యామ

సుందరునిగూర్చి- "అయ్యా! మొన్నటి సభలో తమరు నుడివిన చిత్రకథను గురించిన వ్యక్తి యెవరైయుండు"రని ప్రశ్నించెను.

అందుల కా శ్యాముడు సమాధానమివ్వక మిన్నకుండ బాబురావు తనతల్లితో— "అమ్మా! ఈసమయమున నానీచుని ప్రస్తావనమేల? ఆకులద్రోహి బ్రాహ్మణకులమున బుట్టుటయే పరమదౌర్భాగ్య మని" నుడివెను.

"ఎవ రా యువకుడు? వాని చరిత్రమేమి?" యని రామమూర్తిగారు ప్రశ్నింప బాబురావు తనతండ్రి నుద్దేశించి— "నాన్నా! ఆ నీచు డెవ్వడైననేమి? వంశమున కంతటి కపకీర్తి దెచ్చెను. ఈమధ్య మేము తమ్మిలేరువైపునకు షికారునకుజని వచ్చుచుండ త్రాగి యొడలెరుంగక వస్త్రవిహీనుడై దారికడ్డముగ బడియుండెను. మే మాతనిగాంచి మిక్కిలి విచారించితిమి. హరీ! హరీ!! యాదృశ్యమును స్మరించిన నాయొడలు కంపమెత్తుచున్నయది. కాని మానాభిమానములను త్యజించి తలయెత్తి తిరుగ నాతనిమనం బెటులొప్పెనో!" యని యసహ్యపడసాగెను.

తమ కొమరుని పలుకుల వినినంతనే రామమూర్తిగారు నిర్ఘాంతపడి యేమియుదోపక నాలోచించుచుండిరి. కామేశ్వరుని ముఖకాంతి నల్లవడ, యొడలు చెమ్మటలుగలుగ తన గుట్టు బయటపడెనే యని కుందుచు, కనులవెంట నీరుగారఁ మోమావలివైపునకుద్రిప్పి, తలయూపి శ్యామబాబులపై నెటులయిన పగసాధింపవలెనని యోజించుచుండెను.

కమలమ్మ కామేశ్వరుని మనోవికారములను గ్రహించి తన యనుమానమే దృఢమైనదని, ఆ త్రాగుబోతును తన గృహమునుండి వెడలనడపుటకు తగిన యుపాయముల నాలోచింపుచుండెను. సరసిజ యాసంభాషణముల నాలకించి యావ్యక్తి యెవరై యుండునాయని యాలోచింపసాగెను. మన మిత్రత్రయము తమలోతాము నవ్వుకొనసాగిరి. కామేశ్వరు డొకింతతడవైన పిమ్మట యేలకో భోజనమును వదలి లేచిపోవ నుద్యుక్తుడుకాగా కమలమ్మ—"కామేశ్వరరావు! భోజనమును వదలి వెళ్లుచుంటివేల?"నని ప్రశ్నించెను. అందులకు కామేశ్వరుడు మొగము చిన్నబుచ్చుకొని- "నాకేలనో తలనొప్పిగా నున్నది." యని నుడువుచు లేచి యావలకు బోయెను.

అప్పుడా సరసిజకు తనమేనబావయగు కామేశ్వరుని యందేలనో యనుమానము గలిగెను. భోజనానంతరమున శ్యామసుందరుడు బాబు కమలాకరులతో సావడియందు గూరుచుండి, నాటిపత్రికల దిలకించి, యనంతరము విజయపురము వెడలుటకు ప్రయాణసన్నాహము నొనర్చుకొనుచుండెను. ధూమశకటమునకు వేళయగుటజేసి రామమూర్తిగారివద్ద సెలవు గైకొని శ్యామబాబులు పయనమై వెడలనుండ, సరసిజ గాంచి తనప్రియుడు వెడలనున్నాడేయని మనము చింతనొంద, నేమి యునోపక తన పడకగదిలోనికిజని పరుండెను. శ్యామబాబులు కమలమ్మవద్ద సెలవుగైకొని బయటకుపోవ నుద్యుక్తులగు నంతలో బాబురావు తనసోదరిని సరసిజ! అని పిలువ నామె గదివిడచి గృహాంగణములోనికి వచ్చెను. అంతట బాబురావు— "సోదరీ! మేము ప్రచారార్థమై వెళ్లుచున్నారము. నీవు పూర్వ

మువలెనే దేశసేవయం దప్రమత్తవై యుండెదవని నమ్మెద" నని యనెను. సరసిజ చిరునగవున 'నటులనే'యని సమాధాన మిచ్చెను.

అంతట శ్యామసుందరుడు సరసిజతో "నీయట్టి స్త్రీలు గూడ దేశసేవయే మానవులధర్మమని తెలుసుకొనుటవలన భారతదేశమునకు త్వరలోనే కల్యాణము చేకూరగలదని నా విశ్వాసము. నీవు మాతృసేవయందు ప్రమత్తవు కాకుండెదవు గాక." యని నుడివెను. పిమ్మట శ్యామబాబులు సరసిజతో పోయివత్తుమని నుడివి రైల్వేస్టేషనుకడకు పయనమైపోయిరి. కమలాకరుడు తన మిత్రుల నిరువురను విజయపురికి వెడలు ధూమశకటమును ఎక్కించి తాను గృహోన్ముఖుడయ్యెను.

౪

విజయవాడ యువజనకార్యనిర్వాహకవర్గమునకు బొత్తిగా విరామము లేకుండెను. శ్యామబాబులు శాంతిసైన్యమును గూర్చుచుండిరి. దేశభక్తిప్రేరితలై స్త్రీలు సయితము శాంతిసైన్యమున జేరుచుండిరి. శ్యామబాబులు యింటికివచ్చుటకు గూడ తీరుబడి లేకుండెను. సదాశివయ్యగారు తన కొమరుని నెవ్విధముచే నైనను ఈ యుద్యమమునుండి విరమింప రాత్రింబవళ్లు ఆలోచించుచుండిరి. శ్యామసుందరుడు ఉద్యమము విడిచిపెట్టనిచో నతనిని తన గృహమునుండి వెడలిపొమ్మనుటకుగూడ నుద్యుక్తులగుచుండిరి. స్వార్జితమగు తమ యాస్తియందు శ్యామసుందరుని కెట్టి స్వతంత్రత్వమును లేదని బెదరింపజొచ్చిరి.

శ్యామునికి గృహమునకు రా గష్టమగుచుండెను, తండ్రి గారి బెదరింపులకు శ్యామసుందరుడు జంకక గృహమునుండి వెడలిపోవ నుద్యుక్తుడై తండ్రిగారివద్దకుజని "మీయాస్తితో నాకెట్టి సంబంధముగాని, నిమిత్తముగానిలేదు. నాయభిప్రాయము మారదు. పిదప మీయిష్ట"మని పలికి యింటి నుండి వెడలిపోయెను. తనయుని పలుకులు సదాశివయ్యగారికి ములు కులువలె నాటినవి. శ్యామసుందరు డిదివర కెన్నడును పితృయాజ్ఞను మీరినవాడుగాడు. నేడు నిర్భయముగను, నిశ్చలముగను ప్రత్యుత్తర మిచ్చుట యాశ్చర్యముగ దోచెను. ధర్మమునకు కట్టుబడుటచే తండ్రి యాజ్ఞనుగూడ మీర వలసి వచ్చెను.

శ్యామసుందరుడు యింటికిరా మాని, కోయంబత్తూరు బ్రాహ్మణ భోజనశాలలో బస యేర్పరచుకొనియెను. బాబు రావు శ్యాముని వీడలేడుగాని సదాశివయ్యగారు తనపై కార్యమును బూనుదురేమోయని యొకింత యాలోచించు చుండెను. అయినను బాబురావు యిట్టి విషయములను లక్ష్య మొర్చువాడుగాడు.

శ్యామసుందరు డిప్పుడు నిర్భయముగా శాంతిసమరమున దిగి శత్రుపక్షమును డీకొనజొచ్చెను. కామేశ్వరుడు తన వైరి యగు శ్యామసుందరుని బరిమార్ప విజయపురి కేతెంచి యా తని విరోధు లెవరైయుందురా యని యాచూకీ తీయుచుం డెను. ఎట్టకేలకు ఆపురమునందు పూర్వమునుండియు యేదియో కారణమున శ్యామసుందరుని సాధింపవలెనని ప్రయత్నించి విఫలులైన దుష్టచతుష్టయము కామేశ్వరునికి హితులై

తమవద్ద నాతని కాశ్రయమొసంగిరి. హేలాపురి వృత్తాంత మును వారల కెరిగించి వారలతో కామేశ్వరుడు కుట్రాలో చనములను సల్పుచుండెను. తన పురోభివృద్ధి కడ్డుపడిన శ్యామ సుందరుని యెట్టులైనను హత్యగావించి తీరెదనని కామేశ్వ రుడు ప్రతిజ్ఞ యొనర్చుకొనెను.

ఆనాడే శ్యామసుందరబాబురావులు తమ సంచార కార్యక్రమమును ముగించుకొని విజయపురమునకు వచ్చిరి. పాలకవర్గ మాసమయమున నెట్టులైన శ్యామసుందరుని బం ధింప నాలోచనములను పన్నుచుండెను. రక్షకభటు లా శ్యామ బాబుల వెంటాడి తిరుగజొచ్చిరి. శ్యామసుందరునికి వాగ్బంధ నము గావింప యుత్తరు వొసంగిరి. శ్యాము డా వాగ్బంధనా చట్టమును ధిక్కరించివేసెను.

మరునాటి సాయంతనమున రక్షకభటుల యార్భాటము నకు మేర లేకుండెను. ఆయుధపాణులగు భటులు విసువు విరా మములులేక మోటారులారీలపై నెక్కి తిరుగుచుండిరి. శ్యామ బాబులు మోహనచౌకులోని బహిరంగ సభ కేగి యుండిరి. ఆనా డెవరినో నిర్బంధింతురని పురమంతయు కల్లోలముగ నుండెను. బాబురావుకుగూడ అనుమానముగనుండి యుండెను. కాని శ్యామసుందరుని కా విషయమును మాత్రము తెలుప లేదు.

రాత్రి యెనిమిదిగంటలగుసరికి యా మిత్రద్వయము తమ బసకు జనుచుండిరి. సామాన్యములగు దుస్తులతో రక్షక భటులుగూడ మన మిత్రుల వెన్నంటియేయుండిరి. కుట్రాలో చనములను సలుపు దుష్టచతుష్టయముగూడ యొకింత దూర

ముననుండి తనువైరుల గనిపెట్టియే యుండిరి. భోజనానంతర మున శ్యామబాబులు తమబసకు ముఖభాగమునగల వరండా యందు చాపలపై గూరుచుండి యొకింతతడవట ముచ్చటించి యటుపిమ్మట పరుండియుండిరి. ఆనాడు చీకటి మిగుల దట్టముగ నుండెను. ఆకాశము కారుమబ్బులతో కక్కసిల్లుచుండెను. సన్నని జల్లు పడుచుండెను. మనమిత్రులు పరుండియుండిన గృహమునకు నలువైపులను ప్రహరీయును, ముందువైపున సింహద్వారమున నొక గేటును కలవు. కామేశ్వరుని వెంట దుష్టచతుష్టయ మాప్రహరీని దుమికి లోపల ప్రవేశించి, నిష్క పటహృదయులగు శ్యామబాబులు పరుండి యుండిన వరండా యం దొకవైపున దాగియుండి యట నిదురించుచుండిన యిద్దరు వ్యక్తులలో శ్యాము డెవరో గుర్తింపజాలక విచారించుచుండిరి.

శ్యామసుందరుడు గాఢ నిద్రయందుండెను. బాబురావు నకు మాత్రము నిదురపట్టక, నిటునటు బొరలుచు నావలించి కృష్ణా, కృష్ణా యని పరుండెను. ఆకంఠధ్వనిని గుర్తించి బాబు రావుగా నెరింగి యాతని కావలివైపుననున్న వ్యక్తియే శ్యామ సుందరుడని నిర్ధారణ మొనర్చుకొని కామేశ్వరరావు తన మిత్ర బృందమున కెరుకపరచెను. అనంతరము వారందరును కలసి యేవిధముగా తమ కార్యసిద్ధియగునో యాలోచించుకొన సాగిరి.

ఇంతలో ప్రభుత్వకార్యాలయమున పండ్రెండు గంటలు మ్రోగింపబడియెను. రక్షకభటులకు బదులు చోరభటులు గస్తీ దిరుగుచుండిరి. కొలదికాలము క్రిందట రక్షకభటులు గస్తీదిరు గుట మానివేసియుండుటవలన నాలోటుపాటులను పూర్తిచేయు

టకై చోరాగ్రేసరులు తలపెట్టిరిగాబోలును. బాబురావు మెల కువతో నుండెనేయనియు, శ్యామసుందరుని బరిమార్చుట యెట్లనియు నా కుట్రదారులు తీవ్రముగా నాలోచింప నారంభించిరి. ఒకింత తడవైనపిమ్మట బాబురావు నిశ్శబ్దముగ నిద్రించుచుండుటయు, నాప్రాంతమున మరెచ్చటను కలకలము లేక యంతటను ప్రశాంతముగా నుండుటను గాంచి, యను కున్నటుల వేళయగుచున్నయది. ఇప్పుడే మంచిసమయము. చాల యనుకూలముగనున్నది. మన కర్తవ్యమును నెరవేర్చుట కెట్టి యాటంకము నుండబోదని ధైర్యసాహసము లుప్పతిల్ల కామేశ్వరరావు తన మిత్రులకు సైగజేసి కొందరిని యావలి వైపునకును, మరికొందరను బాబురావుకడను కాచియుండు డని నియమించి తన పటకానుండి కత్తినిదూసి మెల్లమెల్లన నక్కుచు, నటునిటు జూచుచు, శ్యామసుందరుని సమీపించు చుండెను.

ఇంతలో దైవవశమున గాబోలును యావీధియందు పరుండియుండిన శునకములు మొఱుగజొచ్చెను. కుక్కల యర పులవలన నాప్రాంతమున మనుష్యసంచారము గలిగినట్లూ హించి యా హంతకుడు తనమిత్రులకు సైగజేయ వారందరు యథాస్థానములకు వెళ్ళి దాగియుండిరి. తానును వారితో పాటుగ తన స్థానమునకు చేరుకొనియెను. కొంతతడవైన పిమ్మట నలువైపుల నిశ్శబ్దముగ నుండుటను గమనించి, కొంచె మీవలకు వచ్చి నలుదిశల పరికించిచూచిరి. కాని యచ్చట నెవ్వరును వారిదృష్టిపథమున బడలేదు. ఇక నాలసించిన ప్రయోజనములేదని గ్రహించి కామేశ్వరుడు తన మిత్రులను

పూర్వమువలెనే యథాస్థానములయందప్రమత్తులరై యుండు డని నుడివి, ద్విగుణీకృతధైర్యసాహసములతో బయలుదేరి శ్యామసుందరుని సమీపించుచుండెను.

ఇంతలో రోడ్డుమీదనుండి యొక మోటారుశబ్దము వినవచ్చెను. మరియొక యాటంకమాయని హంతకు లాలోచించుచు దాగుకొన ప్రయత్నించుచున్నంతలో నామోటారు యాగృహమువద్దకే వచ్చి నిలచెను. ఆసంఘటనమునుచూచి యాహంతకులు తత్తరపడి యెటుబోవుటకును, వీలుగానక తమ తమ పూర్వస్థానములకుపోయి దాగియుండిరి. మోటారునుండి దిగిన యాయుధపాణులగు రక్షకభటులు బారులుదీరి నిలువబడియుండిరి. రక్షకభటనియంత నిర్బంధపత్రమును చేతబుచ్చుకొని శ్యామసుందరరావుగారు! శ్యామసుందరరావుగారూ! యని పిలువజొచ్చెను.

బాబురావు నిద్రమేల్కాంచి—ఎవరండి వారు! యని యడిగెను. అందులకు సమాధానముగా శ్యామసుందరావుగారున్నారా? యని రక్షకభటనియంత యడిగెను. అంతట బాబురావు లేచి దీపమువెలిగించి యా లాంతరును చేతబుచ్చుకొనివచ్చి బయట గేటుద్వారము దెఱచి, తనయెదుట నిలువబడియుండిన రక్షకభటవర్గమును, చేత కాగితమును బుచ్చుకొని తన కెదురుగా వచ్చుచున్న రక్షకభటనియంతనుజూచి యెవరికొరకు వచ్చితిరని ప్రశ్నించెను. శ్యామసుందరరావుగారిని దోడ్కొనిపోవుటకని యారక్షకభటాధికారి ప్రత్యుత్తరమిచ్చెను. ఆపలుకు లాలకించినంతనే బాబురావుకు పట్టరాని సంతసము గలిగి 'యటులనా! నానెచ్చెలి కంతటి బహుమానము సంప్రాప్త

మైనదా! ఇయ్యది ఆంధ్రదేశ రాజకీయములకు నూత్నశోభను చేకూర్చినది. మంచిది. వా రిచటనే యున్నారు. లోపలకు రండు.' అని బాబురావు ఆరక్షకభటాధికారిని వరండాలోనికి దోడ్కొనిపోయెను. అనంతరము బాబురావు యువజనసంఘాధ్యక్షుడగు శ్యామసుందరరావును మేల్కొలిపి, 'శ్యామా! నీకు పరమపవిత్రమగు శుభలేఖ యొకటి వచ్చినది. దానిని స్వీకరించుటకై కృతప్రయత్నుడవగు'మని మందహాసమున నుడివెను. అంత శ్యామసుందరుడు లేచి కూరుచుండి 'బాబూ! నీ వెప్పుడును యేదియో వింతగా మాటలాడుచుందువు. నీవు మేల్కొలుపుటవలన గాఢతమమగు నిద్ర భంగమైనది'యని యనుచు, నీవల నిలువబడియుండిన రక్షకభటాధికారినిగూర్చి, బాబురావువాక్యముల కర్థ మిది గాబోలునని గ్రహించి, 'ఓహో! మీరా! ఇటుల దయచేయు'డని యాప్రక్కనుండిన కుర్చీనొకదానిని యీవలకులాగి దానిమీద కూరుచుండ నియమించెను.

అంత రక్షకభటాధికారి పాలకవర్గమువారి యధికారపత్రమును శ్యామసుందరుని చేతి కందిచ్చెను. శ్యామసుందరుడా పత్రమునందికొని వీక్షించి, 'ఆహా! ధన్యుడను. ధన్యుడను. మిత్రమా! నాకు సెలవిప్పింతువా?' యని మందహాసవదనారవిందుడై తన ప్రాణస్నేహితుడగు బాబురావువైపుదిక్కు మొగమై నుడివెను.

బాబురావు తనమిత్రుని త్యాగశీలమునకు సంతసించి కరస్పర్శనముగావించి 'నీ యాశయములు సత్వరముగ సఫలీకృతములయి తిరిగి మన మొండొరులము కొలదికాలములోనే కలుసుకొన గలుగునట్లు భగవాను డనుగ్రహించును గాక!'

యని నుడివి శ్యామసుందరుని వీడ్కొలిపెను. అనంతరము రక్షకభటులా శ్యామసుందరుని మోటారుపై నెక్కించుకొని వెడలిపోయిరి.

ఇదివర కేర్పరచుకొనిన కార్యక్రమము మారిపోవుట చేతను, యువజనసంఘాధ్యక్షుడగు శ్యామసుందరుడు నిర్బంధింపబడుటవలన కార్యభారమంతయు తనమీఁద బడుటచేతను బాబురావుకు నిదురపట్టక కొంతకాలమువర కాలోచించి, తుట్టతుదకు తనమిత్రుని యాశయములను, నెరవేర్చుటయే తన కర్తవ్యమని నిశ్చయించుకొని పరుండెను.

మూలమూలల దాగియుండిన హంతకులు బ్రతుకు జీవుడా! యని తత్తరమున గోడదాటి రోడ్డుపైనబడిరి. కామేశ్వరుడు తన ప్రయత్నములన్నియు వృథాయైనందులకు నపరిమితమగు విచారమునుజెంది తన మిత్రవర్గముతో గలసి తానున్న నెలవునకు జనియెను.

మరునాటి యుదయమున పెందలకడనే బాబురావు నిద్రమేల్కాంచి నిత్యకృత్యములను దీర్చికొని దుస్తులధరించి పయనమై రక్షకభట కార్యాలయమున కేగెను. అచ్చట యినుప కటకటములుగల ఒక గదిలో తనచెలికాడు బంధింపబడి యుండుటనుగాంచి మాటాడ నుద్యుక్తుడై ముందరకునడచెను. వెంటనే యచ్చట కావలిగాయుచున్న భటుడు బాబురావు నడ్డగించి నిలువబెట్టెను.

ఈదృశ్యమునుగాంచి శ్యామసుందరుడు తన మిత్రుడగు బాబురావును సంబోధించి—బాబూ! నీకీ యాందోళనమేల?

ధీరుడవై మాతృసేవ నొనర్చి అచిరకాలముననే నన్ను జేర రమ్మనమని నుడివెను.

బాబురావు ఆపలుకుల నాలించి ధైర్యోత్సాహములతో మహా 'ప్రసాదము. అట్లే నీయానతిని నెరవేర్తు'నని నుడివి యావలకు జనియెను. తదనంతరము బాబురావు యువజనసంఘ కార్యాలయమునకుజని వార్తాపత్రికలకును, హేలాపురికిని లేఖలును, జాబులను వ్రాసిపంపెను.

శ్యామసుందరుని యర్ధరాత్రమున నిర్బంధించిరనువార్త పట్టణమంతయు వ్యాపించెను. ప్రజలు తమ పనిపాటలనెల్లగట్టి పెట్టి నగరమంతయు హరతాళము నొనర్చిరి. విచారణ సమయమునకు ప్రజలు వేనకువేలుగా కచ్చేరీచుట్టును మూగజొచ్చిరి. రక్షకభటులు లాఠీల చేబూని యమాయకులగు ప్రజలపై బడి చెదరగొట్టుచుండిరి. ప్రజాళికి తీవ్రమైన గాయములు తగులు చుండెను. అయినను ప్రజలుమాత్రము తమ దృక్పథమును వీడక "అహింసా పరమోధర్మః" యను సూత్రమును జపించుచు నిసుమంతయైన చలింపక నటులనే నిలువబడియుండిరి.

ఇట్టి స్థితియందు రక్షకభటవర్గ మాశ్యామసుందరుని మోటారుపై నటకు తీసికొనివచ్చిరి. శ్యామసుందరుడు మోటారునుండి దిగుచుండుటనుగాంచి ప్రజలు "వందేమాతరం-శ్యామసుందరునికి జై "యను ధ్వను లొనర్చుచుండిరి. ప్రజలను గూర్చి మీరలందరును శాంతముగా నుండుడని నుడువుచు శ్యామసుందరుడు వెంట రక్షకభటులు గొలువు కచ్చేరీలోనికి జనియెను. తమకొమరుని నిర్బంధించిరనువార్త తెలిసి సదాశివయ్యగారట కరుదెంచి శ్యామునిజూచి మాటలాడెను.

బాబురావు తనమిత్రునిగలసి యాలింగన మొనర్చుకొని, కొంతకాల మెద్దియో ముచ్చటించెను. పిమ్మట రక్షకభటులు శ్యామసుందరుని దోడ్కొనివచ్చి న్యాయమూర్తియెదుట నిలువబెట్టిరి. న్యాయస్థానమంతయు ప్రేక్షకులతో క్రిక్కిరిసి యుండెను. సదాశివయ్యగా రట కరుదెంచి న్యాయవాదుల నియమితస్థానమున గూరుచుండియుండిరి.

బాబురావు తనమిత్రుని ప్రక్కన కుర్చీపై ఆసీనుడై యుండెను. పత్రికావిలేఖరులు తమ ప్రత్యేక నియమిత స్థానములం దాసీనులై యుండిరి. శ్యామసుందరుని బంధుమిత్ర వర్గమంతయు నాచేరువనే యుండెను. నాయకులు, ప్రచారకులు మున్నగు దేశభక్తు లట కరుదెంచి యుండిరి. న్యాయమూర్తి న్యాయపీఠముపై నధిష్టించియుండెను. డలాయతీ బంట్రోతులు ఉస్ ఉస్ అని యెల్లరను నిశ్శబ్దముగ నుండునట్లు హెచ్చరించుచుండిరి. రక్షకభట న్యాయవాది శ్యామసుందరునిపై అభియోగమును ప్రవేశపెట్టెను. కేసు విచారణ జరిగెను.

కేసు విచారణానంతరము ఎల్లరును నిశ్శబ్దముగ నుండ న్యాయమూర్తి తీర్పును జదివి వినిపించెను. శ్యామసుందరుని కొక సంవత్సరము విడికైదు శిక్షను వేయుచు, నవీనముగ నుత్పత్తియొనర్చిన తరగతులలో బి. తరగతి నిచ్చెను. ప్రజల కోలాహలము చెలరేగ జయజయధ్వానులమధ్య శ్యామసుందరుని మోటారుపై నెక్కించిరి. ఆయుధపాణులగు రక్షకభటులు శ్యామునికి నలువైపులను గూరుచుండిరి. రోడ్డుపై మూగి యున్న జనసమూహాము మధ్య నామోటారుకారు వెళ్లుట కష్టమయ్యెను.

ఎట్టకేల కామోటారు ఆజనసమూహమును తప్పించు కొని రాజవీధిని బోవుచుండెను. అంతకుపూర్వమే శ్యామసుంద రునికి శిక్ష వేసిరనియు, కారాగృహమునకు గొంపోదురనియు పట్టణమంతయు వ్యాపించెను. రాజమార్గమునందు ప్రజలు ఇరువైపులను నిలువబడి కాచికొని యుండిరి. బాలకులును, బాలికలును జాతీయపతాకముల చేబూని జాతీయగీతములను బాడుచుండిరి. సువాసినులు ఆరతిపళ్లెరములను చేబూని భారత మాతృ స్తవము నొనర్చుచుండిరి. శ్యామసుందరుని మోటారు రాకనుగాంచి ప్రజలు జయజయధ్వను లొనర్చుచుండ, స్త్రీలు ఆరతులొసంగి పుష్పాక్షతలను వెదజల్లుచుండ నామోటారు రైల్వేస్టేషనును జేరబోయెను. చెన్నపురిప్యాశెంజెరులో శ్యామ సుందరుని నరేంద్రపురి చెరసాలకు గొంపోయిరి.

ఒకనాటి ప్రాతఃకాలమున కమలాకరరావు- యింటికడ తనగదిలో నొంటరిగ గూరుచుండి దీర్ఘాలోచనాపరుడై యుం డెను. ఆయాలోచనమున కంతములేక- యేమియుదోపక చూపరులకు పిచ్చివానివలె గన్పడుచుండెను.

శ్యామసుందరుని సరసిజ ప్రేమించియుండిన విషయ మును, బాబురావు తనచెలియలగు సరసిజను శ్యామునకిచ్చి పరిణయమొనర్ప కుతూహలుడై యున్న విషయమును, రామ మూర్తిగారు తమ కొమరితను కామేశ్వరునకిచ్చి వివాహ మొనర్పవలెనను సంకల్పమును, కమలాకరరావునకు తెలియక పోలేదు. గత సాయంతనమున సరసిజ తనతల్లితో వాసుదేవా లయమున కరుదెంచుటయు, ఆసమయమున నాసుదతి తన కష్ట

సుఖములను గూర్చి ముచ్చటించుచు విచారనిమగ్నమైయున్న కతమున కమలమ్మ తన కొమరితనోదార్చి బాబురావు నిటకు వెంటనే రప్పింపుమని యానతిచ్చి వెడలిన విషయములును, కమలాకరుని మనమును మిక్కిలి కలతనొందించెను. దుస్స్వభావుడగు కామేశ్వరునిగూర్చి సరసిజ వెలిబుచ్చిన యసూయాభావమును, రామమూర్తిగారు చేయుచున్న వివాహప్రయత్నములును, అంతుమీదట సరసిజయొక్క సాహసపూర్వకమగు అంత్యానిశ్చితాభిప్రాయమును ఒక్కుమ్మడిగ స్మరణమునకు వచ్చి కమలాకరుని యపారమగు విచారసాగరమున ముంచివైచెను.

శ్యాముని నిర్బంధించిన నాటనుండి బాబురావు విజయపురిలో నుండుటజేసి యాతనికొక లేఖ వ్రాయ నుద్దేశించి, గాబోలు కమలాకరు డట బల్లపైనుండు కలమును, కాగితమును చేతబుచ్చుకొని వ్రాయ నుంకించి, మరల ఏలనో వ్రాయ శంకించి కల మట బడవైచి యనేకవిధములగు తలంపులామిత్రుని చీకాకుపరుప నాలోచనానిమగ్నుడై యెట్టకేలకు, జాబు వ్రాసిన నిదానముగా చేరగలదు. తంతినిచ్చిన వెంటనే బయలుదేరి సమయమునకు రాగలడు. లేనిచో నాప్రయత్నములన్నియు వ్యర్థములగునని యూహించి "ఇచ్చట గృహపరిస్థితులు విషమస్థితియందున్నవి. నీవు త్వరితముగ రావలయును" అని తంతివార్తామూలమున తెలియజేయుటకై తంతికార్యాలయమునకు జనెను.

మరునాడు రామమూర్తిగారు తన పుత్రిక వివాహవిషయమునుగూర్చి శుభదిన మాలోచించుచుండిరి. కమలమ్మ

యెంతమాత్రము ఆ సంబంధము పనికిరాదని విసువు విరామములులేక రామమూర్తిగారికి నచ్చజెప్పుచుండెడిది. అయినను రామమూర్తిగారి యభిప్రాయము మాత్రము కామేశ్వరుని కియ్యవలయుననియే యుండెను. సరసిజ తన తల్లిదండ్రుల సంభాషణమును వినిన కారణమున పరిపరివిధములగు యాలోచనములు బొడసూప తనలోతాను దుఃఖితయై మొగము చిన్నబుచ్చుకొని తన యీప్సితము నెరవేరదను నిరాశవలన దినదినము కృశించిపోవుచుండెను.

ఎల్లపుడును చిఱునగవున వికసించియుండెడి యాపద్మిని ముఖవికాసము నేడు మిక్కిలి వాడుబారి యుండుటను కమలమ్మ గాంచి మాతృప్రేమ ముట్టిపడ తనచెంతకు జేరబిలుచుకొని—అమ్మా! సరసిజ! నేనుండ నీకేలభయము? నామేన ప్రాణములున్నంతవరకు నిన్ను నాదుష్టుని కివ్వ నిచ్చగింతునా? నీయభీష్టప్రకారమే నెరవేర్పగలను. అన్నయ్యకు కమలాకరరావు తంతి నంపియున్నాడట. అన్నయ్య వచ్చినపిదప కర్తవ్యమాలోచించి నాప్రతిజ్ఞ నెరవేర్ప యత్నించెదనని తన ముద్దులపట్టిని యోదార్చెను.

ఒకవైపున కామేశ్వరరావు తనవైరియగు శ్యామసుందరు డిట్టిసమయమున కారాగృహమున బంధింపబడియుండుట కెంతయు సంతసించుచు, సరసిజను పరిణయమాడి సర్వసుఖముల బడయవచ్చునను గర్వముతో కన్నుమిన్నుగానక విఱ్ఱవీగజొచ్చెను.

రామమూర్తిగారు తనపుత్రిక వివాహమునకు లగ్ననిశ్చయమొనర్ప సమకట్టి, నిరంతర మా విషయమునకు దగిన

ప్రయత్నములను సమకూర్చుకొనుచుండెను. సరసిజ తా వరించిన ప్రియుని దివ్యవిగ్రహము కనుల బొడగట్టినటులుండి చింతాక్రాంతయై కనుల నీరుగార ననేకవిధములగు తలంపు లుప్పతిల్ల కలతనొందెను. శ్యామసుందరుని కారాగృహమునకు గొంపోవు చున్నపుడు సరసిజ తన తల్లిదండ్రులతో రయిల్వేస్టేషనుకు జని యాతని కనులారగాంచి యనేకవిషయములు ముచ్చటించు టయు, తనప్రియుడు తననుగూర్చి కమలాకరునితో నుడివిన విషయములు జ్ఞాపకమునకు రా మనోవ్యాకులతచే నిరంతర చింతాక్రాంతయైయుండెను. కమలమ్మ యెంత యోదార్చినను సరసిజ యుపశమింపదయ్యెను.

కామేశ్వరుడు తన యనుచరులతోగూడి మిక్కిలి త్రాగుబోతై యెరిని లెక్కజేయక తిరుగుచుండెను. ఒక నాటి మధ్యాహ్నమున సరసిజ తనగదిలో నొంటరిగ శయ నించి యుండుటనుజూచి కామేశ్వరరావు త్రాగి యొడలెరుం గక నట కరుదెంచి సరసిజను గవయ ప్రయత్నించెను. సరసిజ యాత్రాగుబోతునుగాంచి నిర్ఘాంతపడి నోటమాటరాక యొ కింత తడవు పెనగులాడి యెట్టకేలకు తనతల్లిని కేకవేసెను. వెంటనే కామేశ్వరుడు సరసిజ నూరుమూయ నుద్యుక్తు డయ్యెను. కాని విఫలమనోరథుడయ్యెను. ఇంతలో కమలమ్మ తన కొమరిత యట్టి కేకవేయుటకు కారణమేమైయుండునా యని వేగముగ నచ్చట కరుదెంచుచుండుట కామేశ్వరుడు చూచి సరసిజను విడచి యొకింతదూరమునకు జని నిలువబడి యుండెను. సరసిజ తనతల్లినిజూచి త్రాగివచ్చిన కామేశ్వరుని దుర్మార్గకృత్యము నుగ్గడించి విలపింపసాగెను.

అంతట కమలమ్మ రోషావేశమున నరుణితనేత్రయై— ఓరీ! నీచుడా! నీకింతటి కండకావరమా? పొగరు కండ్లు కెగ దట్టెనా? ఇంతటి నీచకృత్యములకు పాల్పడితివా? చూడుము. నీమద మడంచెదను. ఛీ! నీవింతటినుండి నాయింట నుండతగవు. వెడలిపొమ్ము. లేకున్న నిన్నిప్పుడే వెడలగొట్టించెదనని యింక నేమేమో యనుచు వెడలిపోవ నుద్యుక్తయగుచుండ సరసిజయు నామె వెనువెంటనే బయలుదేరి గృహాంతరమునకు జనెను.

కామేశ్వరుడు హతాశుడై కమలమ్మ తన కార్యమునకు భంగకారి యైనందులకును, ఆమె పలికిన దూషణ వాక్యములకును కుందుచు నీర్ష్యాభావముతో నచ్చటి నుండి బయలుదేరి తలవంచుకొని గృహమునువీడి యెచ్చటికో వెడలి పోయెను.

కామేశ్వరుని యానాటి దుండగములనుగూర్చి యుగ్గడించుటకు రామమూర్తి గారు యింటలేరైరి. విజయపురము నుండి తన కొమరుడు రానికారణమున కమలమ్మ మిక్కిలి యాందోళనమును జెందుచుండెను. మరునాటి యుదయమున కమలాకరరావు తనమిత్రునివద్దనుండి వచ్చిన యుత్తరమును తీసికొనివచ్చి కమలమ్మగారికి ఇచ్చెను. ఆయుత్తరమును కమలమ్మ సరసిజ కందించి చదువుమని నుడువ సరసిజ యీ క్రింది విధముగా జదువ మొదలిడెను.

మిత్రమా!

నీతంతి చేరెను. ఉద్యమము తీవ్రరూపముదాల్చి యుండుటచే వెంటనే వచ్చుట కవకాశము లభింపకపోయెను. రాబోవు ఆదివారము

సాయంత్రము బండిలో రాగలను. గృహసంబంధమగు పరిస్థితులు విషమ మందున్నను భయపడవలదు. వెంటనే వివరముగా నొకలేఖ వ్రాయుగోరు చున్నాడను. నేను వచ్చినయనంతర మన్ని విషయములను చక్కజేసెదను.

ఇట్లు
బాబురావు.

ఈసమాచారమును వినినతోడనే బాబురావు ఆలస్య ముగవచ్చుననియు, నంతవరకు ఈపరిస్థితుల నెటు లెదు ర్కొనుటయా యనియు, కమలమ్మ యాలోచింపసాగెను. సర సిజ యుత్తరమును చదివి తనసోదరుడు వచ్చుట కింకను యా లస్యమగునెడల ఈలో నెట్టి యిక్కట్టులు వాటిల్లునో యని యును, అదియునుగాక కామేశ్వరుడు గతదిన మొనరించిన దుష్టకార్యమును జ్ఞాపకమునకు రా కన్నుల నీరుగార్ప దొడం గెను. సరసిజ ముఖలక్షణములను వీక్షించి కమలాకరుడు— అమ్మా! యేల యిటుల దుఃఖించెదవు? కారణమేమి? నన్ను నీసోదరునిగ భావించి విషయమేమో తెలియజెప్పుము. అని నుడువగా సరసిజ మారుమాటాడక మిన్నకుండెను.

అంతట కమలమ్మ కమలాకరునిగూర్చి—నాయనా! యేమని చెప్పుదును? దుర్మార్గుడగు కామేశ్వరుడు త్రాగి యొ డలు డెలియక సాహసకృత్యములకు సైతము తలపడియెను. ఆ నీచుడు నిన్నటినుండి యింటికివచ్చుటగూడ మానివేసెనుగాని యేరోజు యేసమయమున త్రాగివచ్చి యేమిచేయునోయని యనుమానము పొడముచున్నయది. ఇంట పంతులవారితో పోరు పడలేకయున్నాము. ఆదుష్టుని యిలువెడలింప కష్టతర ముగ నున్నయది. ఎన్నిచెప్పినను పంతులవారు మాత్రము సర

సిజను ఆదుర్మార్గునకిచ్చి వివాహము జేయవలయుననియే దృఢ నిశ్చయులుగ నున్నారు. లగ్ననిశ్చయమునకై శుభదిన మాలోచించుచున్నారు. వివాహమునకై సర్వప్రయత్నములును జరుపుచున్నారు. బాబుకు కబురుపంపవలయునని నుడివియుండిరి. ఇట్టి సమయమున బాబురాక యత్యావసరము. ఇదివరలోనే బాబు నాతో తన యభిప్రాయమును నుడివియుండెను. నేనుగూడ బాబు యభిప్రాయముతోనే నేకీభవించెదనని నుడివెను.

కమలమ్మ వాక్యము లాలించినంతనే కమలాకరుడు యొకింత తడవాలోచించి—అమ్మా! మీరంతగా విచారింప జనదు. నేనా కామేశ్వరుని నడవడిని కనిపెట్టియే యున్నాడను. వాని మదమడంచ యాలోచించెదను. మీ కావిషయమై యేమాత్రమును భయమువలదు. సంఘసంస్కర్తలగు పంతులవారిట్టి విపరీత మార్గ మవలంబింతురని యెన్నడును తలంపలేదు. కాని వారు ఆకామేశ్వరుని చరిత్ర మిసుమంతయైన గమనించియుండిరని తోపదు. వారికి స్వయముగా యనుభవమునకు వచ్చినప్పుడే తెలియగలదు. వారెన్ని ప్రయత్నము లొనర్చినను వివాహము మాత్రము నెరవేరజాలనీయము. బాబురావు వచ్చినపిదప కర్తవ్య మాలోచింపవచ్చును. నేడే తిరిగి బాబునకొక లేఖ వ్రాయుదును. మీరు యీవిషయమై చింతింపకుందురుగాక యని యింకేమేమో నుడువబోవుచున్నంతలో కమలమ్మ రామమూర్తిగారి రాకనుగాంచి, పంతులుగారు వచ్చుచున్నారు. నీవు వెంటనే లేఖవ్రాసి బాబు నిటకు రప్పింపుమని నుడివి గృహములోనికి జనియెను.

కమలాకరుడు సరసిజను భయపడవలదని యోదార్చి స్వగృహోన్ముఖుడయ్యెను.

విజయపురములో తీవ్రనిర్బంధములు ప్రారంభమయ్యెను. నాయకులు, ప్రచారకులు మున్నగు దేశభక్తులనేకులు శ్రీకృష్ణజన్మస్థానమలంకరించుచుండిరి. ప్రజలు శాంతిసైన్యమున జేరి రణరంగమునం దాహుతియగుచుండిరి. రక్షకభటుల దౌర్జన్యమునకు మేరలేకుండెను. న్యాయస్థానములకు దేశభక్తుల యభియోగములతో తీరుబడి లేకపోవుచుండెను.

యువజనసంఘాధ్యక్షుడు బంధింపబడిన పిమ్మట యాస్థానమునకు విద్యాధరశర్మగారు యెన్నుకోనబడిరి. కార్యదర్శియగు బాబురావుపైన యధికారవర్గమునకు కార్పణ్యము దినదినాభివృద్ధి నొందజొచ్చెను. గూఢచారులగు రక్షకభటులు బాబురావును వెన్నంటియే తిరుగుచుండిరి.

యువకులత్యుత్సాహులై బాబురావుయొక్క యుత్తరువులను శ్రద్ధాభక్తులతో నిర్వర్తించుచుండిరి. బాబురావును నిర్బంధించుటకై యొకవంక ప్రయత్నములు జరుగుచుండెను. కమలాకరుని యుత్తరమును తిలకించుటతోడనే, ముందునడుపవలసిన కార్యక్రమమును నిర్ణయించి వెంటనే బాబురావు హేలాపురికి పయనమై పోయెను.

సదాశివయ్యగారు తమకొమరుడు నిర్బంధింపబడిన పిమ్మట దేశపరిస్థితులను గమనించి తమ యభిప్రాయముల మార్చుకొని న్యాయవాదిత్వమును వదలుకొని దేశసేవయే ముఖ్యకర్తవ్యమని యెంచి ఉద్యమప్రచారమునకు గడంగిరి. సుకుమారులగు స్త్రీపురుషులెల్లరు యెట్టి కష్టములకైనను

జంకక యాంధ్రవీరత్వమును చాటుచుండిరి. స్త్రీలలో స్వాతంత్ర్యదీక్ష గాఢముగ నాటుకొనియెను. స్త్రీలు యుద్యమ ప్రచారమునకు గడంగుటతోడనే పాలకవర్గమునకు భీతి మెండయ్యెను. స్వాతంత్ర్యశక్తిని విచ్ఛిన్నముగావింప సర్వశక్తులను వినియోగింపజొచ్చిరి.

రాజభక్తి పరాయణత్వమే స్వర్గతుల్యమనుకొని పాలకుల యడుగులకు మడుగులొత్తుచుండెడు సదాశివయ్యగారు, దేశదాస్యదారిద్ర్యములను విచ్ఛిన్న మొనర్ప గంకణము కట్టుకొని తీవ్రముగ ప్రచారమొనర్చుచుండిరని ప్రభుత్వ మా దేశభక్తుని బంధించి కారాగృహమునకు బంపినది.

ఇట్టి సమయమున హేలాపురిలో రామమూర్తిగారు శుభకార్యమును తలపెట్టిరి. బాబురావు కీ విషయమై యాందోళనము మెండయ్యెను. దేశమిప్పుడు కష్టదశకులోనై యుండ మీ రీశుభకార్యమును తలపెట్టి సంతోషమున కాలము గడపుటకు తరుణముగాదని బాబురావు తన తండ్రిగారికి నచ్చజెప్పెను. కాని యవియన్నియు నిష్ప్రయోజనకరములుగా గన్పట్టెను. కామేశ్వరుడు గృహమునకు వచ్చుటమాని వేసి యెటనో తిని తిరుగుచుండిన విషయము రామమూర్తిగారికి తెలియదు.

అయినను కామేశ్వరుడు యిచ్చట జరుగు విషయము లన్నియు నెప్పటికప్పుడు యేదోవిధమున తెలిసికొనుచునే యుండెను. తన మామగారి యభిప్రాయమును, గుర్తెరింగిన వాడగుటచే తనకు సరసిజనిచ్చి వివాహమొనర్చునని నిర్విచారుడై యుండెను.

కామేశ్వరుని నామ ముచ్చరించినప్పుడెల్ల బాబురావుకు కోప మతిశయించుచుండెను. మనోవ్యాకులతచే శుష్కించి యున్న సరసిజ దుఃఖమునకు మేరలేక తనసోదరునితో తన నిశ్చితాభిప్రాయమును తెలియపరచెను. అంతట బాబురావు తన చెలియల నోదార్చుచు—అమ్మాయీ! ఊరడిల్లుము. నే నుండ నీకేల ఈభయము? నీయిష్టమువచ్చినవరుని వివాహ మాడుము. తండ్రిగారి యభిప్రాయమును బలపరచి నే నా నీచుడగు కామేశ్వరుని కివ్వ నొడబడుదునా? అటు లెన్నటికిని జరుగజాలదు. ఈవిషయమై అమ్మగారి యభిప్రాయమును గూడ తెలుసుకొనియే యుంటిని. కమలాకరునివలన యిందు లకు తగు ఉపాయము నాలోచించి యట్లొనర్చెదను. రేపటి యుదయమున నేలగ్ననిశ్చయము జరుపబడునట. ఆసమయమున నీ యభీష్టమును నిర్భయముగా వెల్లడించుము. పిమ్మట కార్య క్రమమును నేను నెరవేర్చెదనని యోదార్చెను.

తనసోదరుని వాక్యము లాలించినంతనే సరసిజ కొకింత మనశ్శాంతి చేకూరెనుగాని తన సంకల్ప మీడేరునో లేదో యను సంశయము మాత్రము బాధింపజొచ్చెను. కమలమ్మ తన కొమరునితో ముచ్చటించి లగ్ననిశ్చయకాలమునందు తా మే పద్ధతి ననుసరింపవలెనో దానిని నిశ్చయించుకొనెను.

మరునాటి ప్రాతఃకాలమున పురోహితులను, బంధువర్గ మును రావించి రామమూర్తిగారు లగ్ననిశ్చయమునకై సంప్రతింప మొదలిడిరి. బాబు కమలాకరులు ప్రత్యేక స్థలమున నొకింతతడవు ముచ్చటించుకొని పిమ్మట సావడిలోనికి జనిరి. కమలమ్మ యచట నొక ద్వారముకడ నిలువబడి వారి సంభా

షణములను వినుచుండెను. సరసిజ యపరిమితముగ వ్యాకులిత యై తన పడకగదిలోనికిబోయి పరుండెను. రామమూర్తిగారు తమ కొమరితను కామేశ్వరునికిచ్చి వివాహమొనర్ప నిచ్చగల దనియు, వారి యుభయుల గ్రహమైత్రిని విచారించి సుము హూర్తమును నిశ్చయింపుడనియు తమ పురోహితునకు విన్న వించిరి. తనభర్తమాట లాలించినంతనే కమలమ్మ తన వ్యతిరేకాభిప్రాయమును వెలిబుచ్చుచు, సరసిజ నాకామేశ్వ రున కిచ్చుటకు నేనిచ్చగింపనని ఖండితముగ నుడివెను. ఇంతలో బాబురావును కమలాకరుడును అచ్చటినుండి లేచి యేలకో సర సిజ పరుండియుండిన గదికి జనిరి.

అంతట రామమూర్తిగారు తనభార్య వాక్యములకు ఆగ్రహావేశుడై యిదియేమి! నాయిష్టమువచ్చినవానికిచ్చి వివాహముజేయుటకు నీవు సమ్మతింపవా? యని యనుచున్నం తలో బాబు కమలాకరులు వచ్చి కూరుచుండిరి. అనంతరము కమలమ్మ తన భర్తతో నీవిధముగ చెప్ప దొడంగెను. అది యేమియోకాని మనకు ప్రతినిత్యము వాదప్రతివాదములతో డనే కాలము గడచిపోవుచున్నది. కాని నేను పర్యవసానము తేల్చుకొనవలసిన ఆవశ్యకత యేర్పడినది. ఆడుపడుచు నిచ్చు టలో నాడువారి యిష్టముకాని మగవారియిష్టము పనికిరాదు. అట్టియెడ నీ విషయమున మీయభిప్రాయముతో నే నేకీభ వింపజాలనందులకు మన్నింపవలయును. కామేశ్వరుడన్న మీ కేలనో యభిమానము మెండు. ఆ కారణమున మీరు సాం ఘికసూత్రములను సయితము తృణీకారభావముతో జూచుచు న్నారు. కామేశ్వరుని జీవితము విచిత్రచారిత్రమువలె పరిణమిం

చినది. అయ్యది మీస్వానుభవమునకు వచ్చియుండినచో నిటుల నుడివియుండెడివారుగారు. ముందుముందు నదియే బోధపడ గలదు. కామేశ్వరుని పరిణయమాడ సరసిజ కేమాత్రము సమ్మతమును లేదని నుడివెను.

రామమూర్తిగారంతట కోపోద్రేకులై తన మేనబావను వివాహమాడ సరసిజకు ఏల సమ్మతములేకుండును? చిన్ననాటినుండియు ననుకూలముగను, మిక్కిలి యనురాగముతోడను ప్రవర్తించెడివారు. అయినను సరసిజ యభిప్రాయమునుగూడ తెలిసికొందము. అనుచు సరసిజను యిచ్చటకు పిలుచుకొనిరండన బాబువెళ్ళి సరసిజను పిలుచుకొనివచ్చెను.

సరసిజ తనతల్లిచెంత నిలువబడి యుండుటను రామమూర్తిగారుచూచి—సరసిజా! కామేశ్వరుని వివాహమాడుటలో నీ యభిప్రాయమేమి ? యని యడిగెను.

అందులకు సరసిజ—నాన్నా! నే నాతని వివాహమాడ నొల్లను. ఇదివరకే నేనొక పురుషుని వరించియుంటిని. నే నన్యులను చేపట్టజాలను. అని నుడువుచు తలవంచుకొని నేల జూచుచు మిన్నకుండెను.

సరసిజ పలుకులు రామమూర్తిగారికి వ్యతిరేకముగ గన్పట్టెను. సరసిజా! నామాట మీరెదవా? ఎంతదానవైతివి? చాలు, చాలు నిక నూరకుండుము. కామేశ్వరరావు చాలమంచివాడు. చిన్నదానవు నీకు కష్టసుఖములు తెలియవు. నామాట వినుమని నుడువుచు పురోహితుల కభిముఖుడై—అయ్యా! లగ్నమును నిశ్చయింపుడని యన బాబురావు తనతండ్రిని

గూర్చి—నాన్నా! ఇది న్యాయముగాదు. సంఘసంస్కర్త లిట్టి భావముతో మెలగరాదు. వధువు యభిప్రాయము ననుసరించియే ప్రవర్తించుట యుక్తము. సంఘసంస్కరణాన్యాయముల నొక్కమారు పరిశీలింపుడు. కామేశ్వరుడు చిన్ననాటనే చదువు సంధ్యలుమాని సోమరివలె తిరుగుచున్నాడు. ఆతని విషయమై నేనేమిజెప్పినను మీరు విశ్వసింపరు. కాని వధువు యభిప్రాయమును నెరవేర్చుట యుచితము. ఈ విషయమున నా చెలియల యభిమత మీడేర్చుటయే నాయభిమతము. ప్రస్తుతకాలమున పూర్వాచారులైనను, వధువు సమ్మతిని గ్రహించియే వివాహముల నొనర్చుచుండుటగలదు. అట్టియెడ తమవంటి సంస్కరణాభిమానులు వధువు యభీష్టమును తృణీకరించుట శోచనీయము. స్త్రీస్వాతంత్ర్యమును గోరు తమవంటి పెద్దలే యిట్టి కార్యమునకు గడంగిన లోకము పరిహసింపదే? యని నుడివెను.

అచ్చటనున్న వారెల్లరు బాబురావువాక్యముల కచ్చెరువందుచు రామమూర్తిగారిని తమభార్యాబిడ్డల యభిమత ప్రకారము నడచుటయే శ్రేయస్కరమని నుడివిరి. అంతట రామమూర్తిగారు వారలతో "నాకు సంఘసంస్కరణాభిప్రాయములయందు యేమాత్రమును వ్యతిరేకభావము లేదు. కాని నాతోబుట్టువు మరణసమయమున కామేశ్వరునకు సరసిజ నిచ్చునటుల నొప్పించుకొని గతించినది. నే నాడితప్పువాడను గాను. కావున నాకోరికప్రకారమే జరిగితీరవలయును." అని నుడువుచు పురోహితులతో లగ్ననిశ్చయమునుగూర్చి తీవరింప సాగెను.

తండ్రిగారి నిశ్చయము బలపడుటతోడనే బాబురావుతన మిత్రుడగు కమలాకరునితో నటనుండి లేచిపోయెను. సరసిజ యాశాలత శుష్కించిపోవుటచే విచారనిమగ్నయై యాస్థల మునువీడి తనగదికిజని పరుండెను.

కమలమ్మ మిక్కిలి విచారముతో పడమటింటి ద్వార ముకడ పైటచెరగు పరచుకొని పరుండియుండెను. శుభము హూర్తము నిశ్చయమైన అనంతరము రామమూర్తిగారు సావడిలోనే పడకకుర్చీపై జారగిలబడి వివాహ సన్నాహము లనుగూర్చి యాలోచించుచుండిరి.

భోజనకాల మతిక్రమించిపోవుచున్నను యింట వంట ప్రయత్నము లేమియు లేకుండెను. రామమూర్తిగారు వంట యైనదాయని కేకవేయ సమాధానము శూన్యమయ్యెను. ఇది యేమియనుచు రామమూర్తిగారు లోపలకుజని, యందరును నిశ్శబ్దముగ నెచ్చటివా రచ్చట పరుండియుండుటనుగాంచి, యేమియు మాటాడజాలక యథాస్థానమునకు తిరిగివచ్చి కూర్చుండెను. ఇటులనే యానాడు సాయంకాలమువరకు నందరును ఏకాదశీవ్రత మొనరించిరి.

తుదకు వివాహము నిశ్చయమైనది. తెల్లవారుజామున నాలుగుగంటలకు శుభముహూర్తమైయుండెను. నాటిరాత్రి భోజనానంతరమున పెందలకడనే లేవవలయునను నుద్దేశ్య ముతో నందరును నిద్రించియుండిరి.ముఖ్యులగువారు మాత్రము కావలసిన సామగ్రినంతయు నాయత్తపరుచుకొనుచుండిరి. కమ లమ్మ పెట్టెలు మున్నగు సామానులను సర్దుకొని సిద్ధపరచి యుంచెను. సుమారు రాత్రి పదునొకండు గంటలయ్యెను.

ఆసమయమున రామమూర్తిగారి యింటి పెరటిగుమ్మముకడ నొక మోటారుబండి మెల్లగావచ్చి నిలచెను. అందుండి కమలాకరుడు, బాబురావు దిగి తామేర్పరచుకొనిన రీతిని సరసిజను తీసుకొనిపోవ యత్నించుచుండిరి.

ఇంతలో నెచ్చటినుండియో యొక మోటారుకారు వీధిగుమ్మముకడకు వచ్చి నిలువబడెను. ఆమోటారుశబ్దమును విని కమలాకరు డేలకో మోటారును వీధిగుమ్మముకడకు దెచ్చెనని తలంచుకొనుచు బాబురావు త్వరితగమనమున వీధిగుమ్మముకడ కేతెంచి మెల్లగా ద్వారమును తెరువ మోటారునుండి దిగిన రక్షకభటులు తమ ఆయుధములను సవరించుకొనుచు బారులుతీరి నిలువబడి యుండిరి. ఎదుట నిలువబడియున్న రక్షకభటవర్గమునుజూచి బాబురావు యాశ్చర్యమునకు లోనయ్యెను.

ఈమోటారుశబ్దమును విని యింటిలోనివారుగూడ వీధిగుమ్మముకడకు వచ్చిరి. రక్షకభటాధికారి బాబురావును జూచి మిమ్ము నిర్బంధింప పాలకవర్గమువారి యనుజ్ఞయైనది యని యధికారపత్రమును చేతి కందించెను.

వెంటనే యీ సమాచారము యింటిలోనివారందరికిని తెలియవచ్చి యెల్లరును బాబును సమీపించి యాశ్చర్య నిమగ్నులై బాబూ! నీ విట్టిసమయమున నిర్బంధింపబడుట యుచితముగాదు. యెట్లులైనను విడుదలను పొందుము. తర్వాత సంగతి యాలోచించుకొనవచ్చునని సలహా నివ్వ నారంభించిరి. కాని, బాబురావందుల కంగీకరింపకుండెను.

ఇంతలో కమలాకరుడు వీధిగుమ్మముకడ సందడిగ నుండుటను గాంచి యామోటారు నచ్చటనే విడచి వీధిగుమ్మము కడకు వచ్చెను. బాబురావు కమలాకరుని సమీపించి రహస్యముగ నేమియో యుపదేశించి సెలవుగైకొని తన తల్లిదండ్రులకు నమస్కరించి దీవనలగ్గైకొని రక్షకభటులతో మోటారు నెక్కి వెడలిపోయెను.



ఆ దినముననే విజయపురిలో విద్యాధరశర్మగారిని, మరి కొందరు యువకులను, నిర్బంధించియుండిరి.

రక్షకభటులు బాబురావును తెల్లవారుసరికి విజయపురమునకు దోడ్కొని వచ్చిరి. పురమందలి మిత్రులు, పరిచయులు, సహచరులు మొదలగువా రనేకులు యీదేశారాధకుల జూచిపోవుచుండిరి. హటాత్తుగా తనకొమరుడు నిర్బంధింపబడుటకును, ఆకారణమున వివాహప్రయత్నములు విఫలమైనందులకును హేలాపురిలో రామమూర్తిగా రెంతయు విచారించుచుండిరి. శుభకార్యమునకై అరుదెంచిన బంధుమిత్రులు బాబురావు నిర్బంధమునుగూర్చి మిక్కిలి విచారించుచుండిరి. ఇంతలో కమలాకరుడు కమలమ్మగారితో బాబురావు నుడివిన విషయములను తెలియపరచెను. కాని రామమూర్తిగారు స్వయముగనే వివాహప్రయత్నములను విరమించుటచే కమలమ్మ, కమలాకరులు వివాహనిరోధమునకై మరి యేవిధమగు ప్రయత్నములను చేయ నవసరము లేకపోయెను. కామేశ్వరునికి గలిగిన తీవ్రమగు నాశాభంగమునకును, సరసిజకు చేకూరిన

ఆనందమునకు మేర లేకపోయెను. సరసిజయు, కమలమ్మయు నాయర్ధరాత్రముననే విజయపురమునకు వెడల రామమూర్తి గారి యనుజ్ఞను వేడిరి. కాని ప్రాతఃకాలమున వెడలుదమని రామమూర్తిగారు నుడువుటచే నప్పటికి మిన్నకుండిరి.

న్యాయాధికారి బాబురావు అక్రమసంఘమునకు కార్యదర్శి యను నెపమున నారుమాసములు కఠినవరకమును విధించి "బి" తరగతి నొసంగెను.

అచ్చట తమ మిత్రులను దర్శింప వేచియున్న యువజన సంఘసభ్యులు బాబురావును, అతనితోబాటు శిక్షింపబడిన విద్యాధరశర్మగారిని దర్శించి మాటలాడిరి. ఆసామీప్యముననే తనకొరకై వేచియున్న తన తల్లిదండ్రులను గాంచి బాబురావు కమలాకరునితో వారివద్దకు జని నమస్కరించి యాశీర్వాదముల బడసెను. వివాహప్రయత్నము విఫలమైనదని గ్రహించి బాబురావు యపరిమితానందభరితుడై తన సోదరిని సమీపించి, అమ్మా! పోయివత్తునని యానందబాష్పములను రాల్ప దొడంగెను. సరసిజయు నానందపారవశ్యమున సోదరునకు నమస్కరించి యాతని యాశయములను నెరవేర్ప బద్ధకంకణురాలయ్యెను. అనంతరము యువజనసంఘసభ్యులతో నాలోచించి బాబు, విద్యాధరులు యువజనసంఘమున కధ్యక్షురాలినిగా సరసిజను, కార్యదర్శిగా కమలాకరరావును నియమించిరి. బాబురావు కమలాకరుని యాలింగన మొనర్చుకొని- కమలాకరా! సంఘభార మంతయు నీమీాద నుంచి పోవుచుంటిని. ధైర్యశాలివై మాతృదేశమునకు సేవజేయుమని నుడివి కరస్పర్శనము గావించి సెలవుగైకొనియెను.

ప్రచారకుల కుత్తరువులనంపుటలోను, సభ్యులను జేర్చుకొనుటలోను, కమలాకరునకు తీరుబడిలేకుండెను. రామమూర్తిగారు తమ కొమరిత యొనర్చుచున్న దేశసేవకు సంతోషస్వాంతుడై తగిన చేయూత నొసగుచుండెను. కమలమ్మగారుగూడ ఖద్దరు ప్రచారమున క్రమాభివృద్ధిని గలిగించుచుండెను. కామేశ్వరరావు యెట్టులైనను సరసిజను స్వాధీన మొనర్చుకొనుటకై సకలవిధముల ప్రయత్నించుచుండెను.

సరళకు యుక్తవయసు వచ్చియుండుటచే మురళీధరశర్మగారు వివాహప్రయత్నములకై త్వరపడుచుండిరి. కాని యింతవరకును ఎచ్చటను సరియగు సంబంధము నిశ్చయింపబడి యుండలేదు. ఇటు లొకింతకాలము గడువ సరళ పుష్పవతి యయ్యెను. శ్యామలాంబ సంతసమున నీ శుభవర్తమానమును కమలాకరునకు తెలియపరచెను. కమలాకరుడును, శ్యామలాంబయు తమ ప్రయత్నములు నెగ్గినందులకు లోలోన సంతసించుచుండిరి. సరళ పుష్పవతి యగుటచే నెవరును ఈ సంబంధమును జేసికొనుటకు ధైర్య మవలంబింపకుండిరి. పూర్వాచారపరాయణుడగు మురళీధరశర్మగారిస్థితి యాసమయమున నెట్టులుండునో పాఠకులే యూహించుకొందురుగాక !

## ౭

చెఱసాలలో రాజకీయఖైదీలయందు ఎ. బి. సి. తరగతులవా రనేకులుగలరు. సామాన్య ఖైదీల దురవస్థకంటె సి, తరగతి రాజకీయఖైదీలస్థితి చాల అన్యాయముగ నున్నయది. బి. తరగతియందుండి స్వేచ్ఛ ననుభవించుచుండిన శ్యామ, బాబులు సి. తరగతి సోదరవర్గము పడుచున్న యిడుములను

జూచి యపరిమితమగు మనోవేదనమును బొంది తోడి రాజకీయు లగు సి. తరగతి ఖైదీల కష్టసుఖములలో తాముగూడ భాగ స్వాము లగుటకై తమ కొసంగబడిన బి. తరగతిని యాక్షణ మున నే విడనాడి సి. తరగతిని స్వీకరించి తాముకు తమ సోద రులతోపాటు పనిపాటు లొనర్చుట కలవాటుపడిరి.

ఇటు లొకింత కాలము గడువ శ్యామ, బాబులను, మరి కొందరు రాజకీయఖైదీలను సి. తరగతిఖైదీల నుంచుటకై ప్రత్యేకముగ నిర్మింపబడిన హైదరాలీపురములోని కారాగృ హమునకు గొంపోయిరి. ఈ మిత్రులను నరేంద్రపురినుండి మా ర్పుగావించిరను వార్త సరసిజకు తెలియవచ్చెను. సరసిజ కమలాకరునితో సంప్రతించి ప్రచారకార్యభారము నాతని మీదనుంచి శ్యామ, బాబుల దర్శింప తన తల్లితో గలసి పయ నమై హైదరాలీనగరమున కేగెను.

హైదరాలీ పురమునందలి చెఱసాల ప్రభుత్వమువా రేర్పరచిన విశ్రాంతిగృహమును బోలియుండెను. అచ్చటనుండు సి. తరగతి ఖైదీ లొకింత స్వేచ్ఛ ననుభవించుచుండిరి. శ్యామ, బాబులు తమ సోదరరాజకీయఖైదీలతో సంతోషమున కాల ము గడపుచుండిరి. సరసిజయు, కమలమ్మయు శ్యామ, బాబుల వీక్షించి మాటాడిరి. సరసిజ తన మనోనాథునిగాంచినతోడనే యత్యానందభరితయై దేశమునందలి పరిస్థితులనుగూర్చి ముచ్చ టించి సెలవుగైకొను సమయమున "ఈ నా సర్వశక్తులను సార్వకాలికముగా మి మ్మనుసరించుటకే ప్రయత్నించెదను. భగవానుడు ఈ మన సదుద్దేశ్యములను అతిశీఘ్రకాలమున నెరవేర్చునుగాక" యని ప్రార్థించెను.

శ్యా:—(సంతోషమున) అధ్యక్షులు తలంచుకొనిన నెంతటి కార్యములైనను యవలీలగనే సిద్ధియగును. మీరు దేశమునకు సేయుచున్న సేవయెంతయు స్తుతిపాత్రము.

శా:—(శ్యామునిగూర్చి) శ్యామా! చిరంజీవినియగు సరసిజను నీ వింత పొగడుట శ్రేయము కాదు. ఆమె నీ స్తుతికిగాక నీ ఆశీర్వాదమునకు పాత్రురాలు.

కమ:—బాబు నుడివినదంతయు సత్యము. నా యభిలాషము గూడ నదియే.

శ్యా:—అటులయిన మీ యభిప్రాయముతో నేనును ఏకీభవించుచున్నాడను. సరిసిజా! నీ ఈప్సితములు నెరవేరుట కనువగు ధైర్యోత్సాహసాహసములను పరమేశ్వరు డనుగ్రహించునుగాక యని యాశీర్వదించుచున్నాడను.

సర:—(చిరునగవున) మహాప్రసాదము. మీయానతిని శిరసావహించి ప్రవర్తించెదను.

అని నుడివి సెలవు గైకొనుచున్నంతలో కారాగృహాధికారులు "సమయము మించిపోవుచున్నది. ఇకను మీ రిచ్చట నుండ జనదని" నుడివిరి. వెంటనే కమలమ్మయు, సరసిజయు శ్యామబాబులవద్ద పోయివత్తుమని చెప్పి యీవలకు వచ్చి ఆనాటిసాయంకాలముబండిలో హేలాపురమునకు పయనమై పోయిరి.

హేలాపురమున రామమూర్తిగారు తన మేనల్లుని దుష్ప్రవర్తనము తెలుసుకొనిరి. అప్పటినుండియు దీర్ఘాలో

చనానిమగ్నులై యాతని చెయిదముల నారయుచుండిరి. కామే శ్వరుడు తన వివాహము విచ్ఛిన్నమైననాటినుండియు తన గృహ మునకు వచ్చుటమాని సహచరులతో గలసి తిరుగుచుండుట యును, తనభార్యకును బిడ్డలకును యాతనియందు జనించిన తీవ్ర మగు నసూయాభావమునకును గల కారణములనుగూర్చియును, కమలాకరుడు ఒకసారి వచించిన విషయములను గురించియును, రామమూర్తిగారు తలంచుకొని కలతవడ జొచ్చిరి.

కామేశ్వరుని నడవడిని తాము స్వయముగ గమనింప నారంభించిరి. కామేశ్వరుని దుష్టసాహచర్యము, యాతని కుట్రాలోచనములు రామమూర్తిగారి యనుభవమునకు రా దొడగెను. క్రమక్రమముగా రామమూర్తిగారు కామేశ్వరుని పై తమకుగల సదభిప్రాయమును విసర్జించుకొనవలసి వచ్చెను. కమలాకరుడు పూర్వము కామేశ్వరునిగూర్చి చెప్పిన విషయ ములన్నియు యథార్థములని విశ్వాస ముదయించెను.

తనపై హేయభావముతో మెలగుచుండిన సరసిజను యెటులైనను లోబఱచుకొనవలెనని కామేశ్వరుడు లెక్కకు మీరిన వ్యూహములను పన్నుచుండెను.

ఆనాటి సాయంకాలమున కామేశ్వరుడు పూర్వమువలెనే తన మేనమామ గృహమునకు వచ్చెను. నాటి యుదయముననే హైదరాలీనగరమునుండి కమలమ్మయు, సరసిజయు వచ్చి యుండిరి. కామేశ్వరు డిప్పుడు మామగారిగృహమున కేతెంచుటకుగల యుద్దేశ్యమేమియో మనము నిర్ణయింపజాలము. కాని చాలదినములనుండి రామానిన కామేశ్వరుడు తిరిగి నేడు

వచ్చుటవలన రామమూర్తిగారి యనుమానమునకు మరొకింత బలము చేకూరెను.

కామేశ్వరుడు వచ్చుటతోడనే రామమూర్తిగారు కోపావిష్టులై—కామేశ్వరా? నీప్రవర్తనమంతయు కడుంగడు నీతిబాహ్యముగ నున్నయది. నీ వీక్షణము మొదలుకొని మరి యెప్పుడును నా గృహమునకు రావలదు. నిన్ను పెంచి పెద్దవానిని జేసి విద్యాబుద్ధులగరపి వివాహితు నొనర్చి యభివృద్ధిలోనికి దీసికొనివత్తమని యెంతయో ప్రయాస మొనర్చితిని. ఆ నా ప్రయత్నమంతయు నీ దుష్ప్రవర్తనము మూలమున విరమించుకొనవలసివచ్చెను. నీకు బాగుపడుట కనువగు యోగ్యతగలుగనందులకు నేనేమిచేయగలను? నీ వింత దుర్మార్గుడవై యింతటి నీచస్థితికి వచ్చెదవని నే నెన్నడును తలంపలేదు. నీవు చెడిపోవుటయేకాక నాకు అవమానమును దెచ్చిపెట్టితివి. తక్షణమే నీవు నా గృహమునుండి వెడలిపొమ్ము. నీయట్టి నీచుని ముఖమును తిలకించుట పాపము. పొమ్ము సత్వరముగ నాయిల్లు విడచి పొమ్మని కామేశ్వరుని గెంటివైచెను. గృహమునందుండిన కమలమ్మయు, సరసిజయు నీవింతదృశ్యము తిలకించి యాశ్చర్యనిమగ్నలై చూచుచు నిలువబడియుండిరి.

కామేశ్వరుడు నిరుత్తరుడై యేవిధమగు సమాధానము చెప్పుటకును నోరాడక తలవంచికొని వెడలిపోయెను.

కామేశ్వరుడు మామగారి గృహమునువీడి రాజమార్గము ననుసరించి పోవుచు తనలో తానిటుల తలపోయసాగెను. ఏమి? నామామగారు నాపై యింతటి కాఠిన్యమూనుటకు కారణమేమై యుండును. నన్నుగూర్చి ఎన్నడును ఆగ్రహము

నైన జెందని మామగారిట్లు కోపోద్రేకులై నాగృహమునుండి వెడలిపొమ్మని గెంటివైచుట జూడ నిశ్చయముగ నామీద నున్నవియు, లేనివియును గలపి కమలాకరుడును, కమలమ్మయు, సరసిజయు వారిమనమున కెక్కునట్లు నచ్చజెప్పి యుండనోపు. లేకున్న నిటుల ఎన్నటికిని జరుగజాలదు. కానిమ్ము. వీరిపై నేను పగసాధింపలేక పోవుదునా? సరసిజ విషయములో నే తల పెట్టినకార్యము సఫలీకృతమయ్యే తీరవలయును. ఎటుల నెర వేరదో చూచెదనుగాక! సరసిజా! నన్నుగాదని యన్యుని వివాహమాడి సౌఖ్య మనుభవింతునని గర్వించుచుంటివి గాబోలు. ఈ కామేశ్వరుడు తన జీవితమునంతయు వినియో గించియైనను నిన్ను చేపట్టితీరును. అట్లుగానినాడు నీజీవితసౌఖ్య ముల నన్నిటిని భగ్నమొనరించి తనతో సమానమైన మాన సికవ్యధకు లోనొనర్చునని జ్ఞాపకముంచుకొనుము. అని మన మును దృఢపరచుకొనుచు తన మిత్రబృంద మున్న స్థలమునకు చేరబోయెను.

సాయంకాలమున తన మిత్రులలో ముఖ్యులగువారిని చేర బిలిచి విషయమంతయు సావధానముగ వినిపించెను. అనం తర మాస్నేహితు లందరును గలసి యొక నిర్జనప్రదేశమున గూరుచుండి రహస్యాలోచన మొనర్చుకొని చిట్టచివర కేదో యొక నిశ్చయమునకు వచ్చి యావిధముగ తమతమ కార్య ములయం దప్రమత్తులై మెలగుచుండిరి.

మరునాడుదయమున కమలాకరునకు రామమూర్తిగారు కామేశ్వరుని గృహమునుండి వెడలగొట్టిరను వర్తమానము తెలియవచ్చెను. కామేశ్వరుడు దుస్స్వభావముగలవాడగుటచే

నిలువెడలగొట్టిన కోపమున నేమి క్రూరకార్యములకు దలపడు నోయని సందేహముగలిగి యాతని ప్రవర్తనమును గనిపెట్టు టకై తగు ప్రయత్నము లొనర్చి కనిపట్టియే సంచరించు చుండెను.

సరసిజ హైదరాలీ నగరమునుండి మరలివచ్చినది మొదలు ద్విగుణీకృతోత్సాహముతో కార్యముల నిర్వర్తించు చుండెను. ప్రభుత్వము దేశారాధకులను తీవ్రనిర్బంధములకు లోనుగావించుచుండెను. యువజనసంఘాధ్యక్షురాలగు సరసి జను నిర్బంధింప ననుకూలమగు సమయమునకై యాలోచన ములను సల్పుచుండిరి. రామమూర్తిగారి గృహముచుట్టును గూఢచారులు నిరంతరమును తిరుగాడుచునే యుండిరి. సరసిజ ధైర్యోత్సాహములతో తన సహచరులను గలసి మద్యపాన నిర్మూలనము, విదేశవస్తుబహిష్కరణము, ఖద్దరుధారణము మున్నగు ప్రచారములను విరివిగాను, స్థాయీభావము నొందు నట్లుగాను చేయుచుండెను. ఆపట్టణమునందలి వర్తకులందు ముఖ్యులయిన వారందరును గలసి తామీదినమునుండి విదేశ వస్తువులను తెప్పింపమనియు, తమవద్దనున్న వస్తువులను యిక ముందు విక్రయింపమనియు ప్రమాణపత్రములమీద సంతక ముల నొనర్చి తమ దుకాణములను మూసివైచిరి. సరసిజ ప్రచారమువలన గలిగిన పరిణామమును పాలకవర్గము గుర్తించి యామెను కొలదికాలములోనే కార్యరంగమునుండి తొల గింప నిర్ణయమొనర్చుకొనెను.

ఒకనాటి యుదయమున కమలాకరుడు తనగదిలో నొం టరిగ గూరుచుండి యెవరికొరకో ప్రతీక్షించుచున్నవానివలె

గన్పట్టుచుండెను. పదినిముసముల యనంతర మొకానొక వ్యక్తి కమలాకరుని గృహమును జేరి త్వరితగమనమున కమలాకరుని గదిని సమీపించుచుండెను. ఆవ్యక్తి గదిచేరువకు వచ్చుటతోడనే కమలాకరుడు ప్రభాకరా! నీ కొరకే యింతవరకును ప్రతీక్షించుచుంటిని. సమయమునకే నీవును వచ్చితివి యని లోనికి యాహ్వానించెను. తన ప్రక్కనుండు కుర్చీపై నాసీనుడైన తదుపరి, నేడు విశేషము లేమియు లేవుగదా! యని యడిగెను.

ప్రభా:—లేవు. నీవు పిలిపించితివియని మానాన్నగారు చెప్పుటతోడనే బయలుదేరి వచ్చితిని. నేడు విశేషముల నారయుటకు దగిన యవకాశ మింకను లభింపలేదు.

కమలా:—సరి! నీ విప్పు డొక యమూల్యమైన కార్యమును సాధించుకొని రావలయును. అందులకే నిన్నింత శీఘ్రముగా పిలువనంపితిని.

ప్రభా:—విషయమును తెలియజేయుము. అది యెంతటి కష్టతరమైనను నాశక్తి వంచనలేక ప్రయత్నించెదను.

కమలా:—కామేశ్వరుడు నేడేదియో క్రొత్త వ్యూహమును పన్నుచున్నటుల నాతని లక్షణములవలన యనుమానము గలుగుచున్నయది. గాన నీవు ఈ విషయమున యప్రమత్తుడవై గూఢముగనుండి వారి రహస్యములను కనుగొనవలయును.

ప్రభా:—ఇంతియేనా? ఇంకేదియో గొప్ప విశేషముండునని భావించితిని. చెన్నప్పను పంపిన యీ కార్యమును దిగ్విజయముగ నెరవేర్చుకొని రాగలడు.

కమలా:—అటులగాదు. నేడేలనో కామేశ్వరునియందు నా కపరిమితమగు ననుమానము పొడముచున్నయది. నీవే తప్పక ఈకార్యమును నెరవేర్చవలెను. అనంతరము పరిస్థితుల ననుసరించి మన కార్యక్రమమును స్థిరపరుచు కొందము. అని యింకేమియో రహస్యముగనుడివెను.

ఈ వాక్యములను వినుటతోడనే ప్రభాకరరావు యొకింతకాల మాలోచనానిమగ్నుడై కమలాకరుని వాక్యములందేదియో రహస్య మిమిడియున్నదని గ్రహించి సరి! అటులనే యొనర్చెదను. సెలవా! యని నుడువుచు తన కార్యసాధనము నకై వెడలెను.

అది మధ్యాహ్నసమయము. రవి తన సహస్ర కరములచే నభోమధ్యమమున ప్రకాశించుచు జీవకోటిని తపింపజేయుచుండెను. ప్రాణిమాత్రమైన ప్రతిజీవియు తమతమ స్వస్థానములను వీడి బయటకు రా వెరచుచుండెను. అట్టి సమయమున నలుగురు వ్యక్తులు ఆపురమునందుండెడు ఒక ప్రాంతమునందలి ఒక సందుత్రోవ ననుగమించుచుండిరి. ఆవ్యక్తులు పోయి పోయి పురమునకు చివరభాగముననున్న యొక పాడుబడిన దేవాలయమునకు జని అందలి లోపలిభాగమున నాసీనులైరి. వీరిమార్గము నన్వేషించుచు మరియొకవ్యక్తి వీరి వెనుకనే జాగరూకుడై వీరిదృష్టిపథమున బడకుండ వచ్చుచుండెను. వీరు యాలయమున ప్రవేశించుటతోడనే యావ్యక్తి యాయాలయముయొక్క వెనుకటిభాగమునకు జని దేవాలయములోపల నుండి నీరుపోవుటకై నిర్మించిన సోమసూత్రమువద్ద చెవినుంచి వారి సంభాషణమును వినదొడంగెను. అవి యస్పష్టములుగా

నున్నను మొత్తముమీద వాటిభావమంతయు బోధపడినటుల యాతని ముఖలక్షణములను తర్వాత జూచినవారికి తెలియక పోదు. వారి సంభాషణములు పూర్తియగు చిహ్నములు గాన్పించిన తోడనే తానాస్థలముననుండుట ప్రమాదకరమని యెంచి యాలయము వెనుకపార్శ్వముననున్న పురుషుడు వెడలి పోయెను. అనంతరము ఆలయమునందలి నల్వురు వ్యక్తులును యొకరివెంట నొకరుగా గృహోన్ముఖులైరి.

కమలాకరుడు తనగదియందు మధ్యాహ్న భోజనానంతరము కొంతకాలము విశ్రమించి లేచి ప్రభాకరుని రాకకై యెదురుచూచుచుండెను. ఇంతలో సమయమునకు ప్రభాకరుడును నచ్చటికి వచ్చెను. ప్రభాకరుని ముఖమును వీక్షించుట తోడనే కార్యము సఫలమొనర్చుకొని వచ్చినటుల తెలిసికొని కమలాకరు డాతనిని లోనికి గొనిపోయి ఈ క్రింధివిధమున ప్రశ్నించెను.

కమలా:—వారెచ్చట సమావేశమైరి ? విషయములు విపుల ముగా తెలుసుకొనగలిగితివా ?

ప్రభా:—మన మూహించినటుల వారాస్థలముననే మంతన మొనర్ప నేగిరి. వారివెనుక వారిని అనుసరించి జాగరూకతతో నేనును వెళ్ళితిని.

కమలా:—వారు నిన్ను కనిపెట్టలేదుగదా ? అనంతర మేమి జరిగినది ?

ప్రభా:—వారు నన్ను కనుగొనజాలని విధమున మెలకువతోడనే మెలంగితిని. వా రా జీర్ణాలయమున ప్రవేశించుటతోడనే

నేను వెనుకభాగమునకు జని సోమసూత్రమువద్ద కూరుచుండి వారి సంభాషణముల దాని రంధ్రముద్వారా యాలకించితిని. అటులైనను అవి అస్పష్టములుగానే వినవచ్చినవి. కాని మొత్తముమీద వారి యభిప్రాయము మాత్రము తెలుసుకొనగలిగితిని.

కమలా:—(ఆతురతతో) రహస్యముగా వచింపుము. ఇది మన గృహమైనను గోడకు చెవులుండు నన్న నామెతను మాత్రము మరువదగినది కాదు.

ప్రభా:—(మెల్లగా) వారందరును నేటిరాత్రి 12 గంటల యనంతరము రామమూర్తిగారి గృహముయొక్క దొడ్డిద్వారమువైపునకు మారువేసములతో నొక మోటారునెక్కి మెల్లగా వచ్చునట్లుగను, మోటారును సమీపస్థలముననే వదలి తాము ప్రాకారము నుత్తరించి లోనికి ప్రవేశించి అందరు నిద్రావస్థయందున్న సమయమున నోట గుడ్డలు దురిమి కండ్లకు గంతలుకట్టి సరసిజను మెత్తుకొనిపోయి మోటారులో నెక్కించుకొని యెచ్చటకో గొంపోయి యామెను నిర్బంధించి యెటులయినను కామేశ్వరుని వరించునటుల సరసిజ యభిప్రాయమును మార్చియైనను లేక బలవంతముగనైనను వివాహమాడుటకు ప్రయత్నముల నొనర్ప నిశ్చయించుకొన్నారలు. సరిగా వినబడకపోవుటచే నెచ్చటకు గొంపోవునదియు తెలిసినదిగాదు.

కమలా:—(కొంతతడ వాలోచించి) ఆహాః! యెంత సాహసము. ఎంతటి నీచప్రవర్తనము. సరి! నేను చెప్పి

నటుల మాత్రము నీవు కొన్ని కార్యములను చక్క బరుపవలయున"ని యతనికి రహస్యముగ నేమేమియో చెప్పిపంపెను.

యువజనసంఘాధ్యక్షురాలగు సరసిజను నిర్బంధింప నధికారవర్గమున కాజ్ఞ లేతెంచెను. కాని యధికారవర్గము మాత్రము ప్రజల కేమాత్రము సంశయమైనను గలుగకుండునట్లు తమ కార్యమును నెరవేర్చుకొన నుద్దేశించి గాబోలు ఈవిషయమును చాల రహస్యముగా నుంచిరి.

ఆనాటి సాయంకాలమున ఆంధ్రరత్న చౌకులో జరిగిన బహిరంగ సభయందు సరసిజ దేశస్వాతంత్ర్యము యువకులపైననే యాధారపడియున్నదనియు, ఎల్లకాలమును నాయకులే నడిపింపజాలరనియు, ప్రతివ్యక్తియు తనకు తానే నాయకుడుగను తానే యనుచరుడుగను నిలచి దేశము స్వతంత్రతను పొందువరకును పోరాడవలెననియును, స్త్రీలు తమకర్తవ్యమును ముఖ్యముగ గుర్తించి పురుషుల కర్థాంగినులను మాటను సార్థకపరుపవలయుననియు నుపన్యసించెను.

సరసిజ యుపన్యాసమునకు ప్రజ లుత్సాహపూరితులై తాము దేశము స్వతంత్రతనొందువరకును ఆవిధముగనే నడచెదమని ప్రతిజ్ఞల నొనర్చిరి. స్త్రీలు సయితము యువజనసంఘాధ్యక్షురాలి గంభీరవాక్యములను విని మనమున నుత్సాహము మొలకలెత్త ధైర్యసాహసములతో తాముగూడ పురుషుల ననుకరించి దేశసేవ యొనర్తుమని విన్నవించిరి. అనంతరము జయజయధ్వానులతో నాసభ ముగియునప్పటికి రాత్రి యెనిమిది గంటలయ్యెను.

సభానంతరము సరసిజ తనతల్లితో గృహోన్ముఖయై జనెను. ఇంటికి చేరుటతోడనే రామమూర్తిగారు నాటి సభావిశేషములగూర్చి ముచ్చటించి పిమ్మట భోజనమునకై లేచిరి. వారందరును భోజనమొనరించి శయ్యాలం జేరునప్పటికి సుమారు పదిగంటల రాత్రి యయ్యెను. అందరును నిదురజెందుచుండిరి.

సరసిజ తనగది గుమ్మము తెరచి పరుండియుండెను. కామేశ్వరుడు తన మిత్రవర్గముతో మోటారునెక్కి మారు వేసములతో రామమూర్తిగారియింటి వెనుక భాగముననున్న నొక చెట్టుక్రింద మోటారునునిలిపి తాము నలుప్రక్కల నెవ్వరులేరుగదా యని తిలకించి ప్రాకారమును లంఘించిరి. అప్పటికి సుమారు ఒంటిగంటరాత్రి కావచ్చెను. వీరలను వెన్నంటియే వచ్చుచుండిన ప్రభాకర కమలాకరులు తమ సహచరులతో యీమోటారు నిలచిన స్థలమును సమీపించి ఈ యర్ధరాత్రమున మోటారు యిచ్చట నుండుటకు కారణ మన్యమైయుండదని యూహించి యీమోటారునందు జారగిలబడి కునికిపాట్లు పడుచున్న వ్యక్తినిచూచి యెవరై యుందురాయని సంశయించి యాప్రక్కనుండి తాము వానికి కనుపడకుండునట్లుగా నావ్యక్తిని నిదానించిచూచి మోటారు డ్రైవరని భావించి యీమోటారు వెనుకభాగమునుండి యొకరివెంట నొకరు మెల్లమెల్లగా రామమూర్తిగారి గృహముచుట్టును తగు స్థలములయందు కాపలా గాయుచుండిరి. ఆయింటి ముందరిభాగమునంగల ప్రహరీగోడను దాటి లోనికి జని కడు జాగరూకతతో పశువులకై నిర్మింపబడిన సావడి గోడచాటుననుండి

సమయమునకై వేచియుండి విద్యుచ్ఛక్తి దీప సహాయమున నా సమాచారమును మాకు తెలియజేయవలయునని కమలాకరుడు ప్రభాకరుని నియోగించెను.

ప్రభాకరుడు మిత్రుని యాజ్ఞానుసారము తన విధ్యుక్త ధర్మమును నెరవేర్ప ధైర్యసాహసములతో ప్రహరీగోడను దాటి యాచీకటిలో నక్కినక్కి నడచుచు తన నిర్ణీతస్థలమునకు జేరి యప్రమత్తుడై విషయములనెల్ల నారయుచుండెను. కమలాకరుడు కొందరను ఆయింటి పార్శ్వభాగమునంగల సందుత్రోవలోను, మరికొందరను నాచుట్టుప్రక్కల అవసరమైన ప్రదేశములయందును కాపునిచి తాను ప్రభాకరునినుండి లోని సమాచారములను గ్రహించుటకై యా సమీపముననే నొక మరుగుస్థలమున నిలచియుండెను. లోపల ప్రవేశించిన వ్యక్తులు సాయుధులై యటునిటు పరికించిచూచి దొడ్డితలుపు గొళ్లెము తీసియుంచి ఆయింటి వెనుకభాగమునందలి ద్వారమును తెరచుటకై నాగవాసమునకు ప్రక్కన కన్నమువేసి యా తలుపును నిశ్శబ్దముగా తెరచివేసిరి.

అనంతరము కామేశ్వరుడు లోపలకు ప్రవేశించి సరసిజ పరుండు గదివద్దకుజని యది తెరువబడియుండుటగాంచి సంతసించి తనకార్యము నెరవేరుట కిదియొక శుభసూచకమని యెంచి సరసిజనుగాంచి ఆమె సరసిజయే అని గుర్తించి వెనుదిరిగి తన మిత్రులవద్దకు వచ్చెను. అనంతరము వారల నందరను తగు స్థలములయందు జాగరూకతతో నుండునట్లుగ నియమించి తనవెంట నొకనిని గొనిపోవ నిశ్చయించుకొని సర్వసంసిద్ధుడై లోనికిబోవ నుద్యుక్తు డగుచుండగనే దైవచిత్ర

మేమియో గాని బయట మోటారులశబ్దము వినవచ్చి యాగి పోయినటుల ధ్వని వినబడెను.

ఈశబ్దమును వినుటతోడనే కామేశ్వరుని కాలుసేతులు చల్లబడియెను. ఇంతలో రామమూర్తిగారు! యని సంబోధించుచు తలుపుగొట్టిన ధ్వని వినవయ్యెను. ఆ పిలుపుల నాలకించినంతనే యింటిలోనివారికి మెలకువ వచ్చెను. రామమూర్తిగారు లేచి ఎవరువారు! అని పడకమీదినుండి లేచి వీధిగుమ్మము వద్దకు వచ్చుచుండిరి. ఈ దృశ్యమును గాంచుటతోడనే కామేశ్వరుడు నిరాశుడై తన యనుచరులతో నిక నిచ్చటనుండుట సురక్షితముగాదని చెప్పి దొడ్డిద్వారముగుండా నొకరివెంట నొకరు యావలబడి మోటారులో నెక్కి పలాయితులైరి.

ఆవ్యక్తులు శూన్యహస్తములతో పారిపోవుటనుగాంచి యీసమాచారమును బయట కావలిగాయుచుండిన వారు కమలాకరునకు విన్నవించిరి. కమలాకరుడు ఈవిషయములను వినుటతోడనే ముందరిభాగమున గలిగిన యలజడికి బెదరి వారు పలాయితులై యుందురని నిశ్చయించుకొనుచుండగనే లోపలనుండిన ప్రభాకరుడు దొడ్డిద్వారముగుండా వెలుపలకువచ్చి జరిగిన వృత్తాంతమునంతయు నెరింగించి, రక్షకభటులతో నిండియుండిన రెండు మోటారులు ముందుభాగమునవచ్చి నిలచినవని తెలియజేసెను. ఈ వాక్యములను వినుటతోడనే కమలాకరు డాశ్చర్యమును జెంది యీ యర్థరాత్రము వేళ వారు యిచ్చటకు వచ్చుట తప్పక సరసిజను నిర్బంధించుటకే యైయుండనోవునని యూహించి సత్వరముగ తా నాస్థానమునకు వెడలెను. ప్రభాకరరావు తమ యనుచరుల నందరను వెడలిపొమ్మని ఆన

తిచ్చి తానుగూడ కమలాకరుని యనుగమించెను. రామమూర్తి గారు ద్వారమును తెరచుటతోడనే రక్షకభటనియంత 'మీ కోమరిత సరసిజ గృహమునందున్నదా ? ఆమెను నిర్బంధించుటకై వచ్చియున్నాము.' అని పలికెను.

ఇటు లనుచుండగనే కమలాకర ప్రభాకరులును, గృహములోపలనుండి కమలమ్మయు నా స్థానమునకు వచ్చిరి. అప్పటికి అచ్చటికి వచ్చిన కమలాకరుని కూడ నిర్బంధించిరి.

సరసిజ తనతల్లిదండ్రులకు ప్రణమిల్లి వారల యాశీర్వాదములను బడసి రక్షకభటనియంతను జూచి స్త్రీనగుటచే ఈరాత్రి నాకు తోడుకై మాతల్లిగారిని గూడ నావెంటవచ్చుట కనుమతింప వలసినదని కోరెను. రక్షకభటాధికారి యందులకు సమ్మతించి వారలను మోటారులో నెక్కించుకొని వెడలి పోయెను.

అనంతరము ప్రభాకరరావు రామమూర్తిగారితో నాటి రాత్రి జరిగిన చిత్రకధనంతయు వివరించి దొడ్డితలుపువద్ద వేసిన కన్నమును జూపించి యానాడచ్చటనే రామమూర్తిగారికి తోడుగాపరుండి మరునాడుదయమున స్వగృహమున కేగెను.

౮

ఆరాత్రి కామేశ్వరరావు తన తుది ప్రయత్నము గూడ విఫలమైనందుల కెంతయు చింతిల్లుచు తన మిత్రులతో స్వస్థానమునకు జేరి యారాత్రియంతయు దీర్ఘాలోచన మొనర్చుచు గడపెను.

సూర్యోదయమగుటతోడనే గతరాత్రి సరసిజను, కమలాకరుని నిర్బంధించిరను వార్త పురమంతయు వ్యాపించెను.

సరసిజ నిర్బంధవిషయమును మామమూలనున్న కామే శ్వరునకును తెలియవచ్చెను. ఆవార్త వినుటతోడనే కామేశ్వ రుడు నిర్ఘాంతపడి మతిచెడిన పిచ్చివానివలె అటునిటు తిరుగుచు, తనలో తా నేదియో ఎల్లప్పుడును గొణుగుకొనుచుండెను.

ఒకనాడు కామేశ్వరరావు తనలో తా నిటుల తలపోయ సాగెను. 'ఆహా! నా జీవిత మేటుల వ్యర్థమైపోయినది? యిటు లగునని యెన్నడైన తలంచితినా? దైవముగూడ ప్రతికూలము గావలయునా? ఇన్నిటికిని మూలము నేను సరసిజను ప్రేమిం చుటయే గదా! ఛీ! మోహ మెంత దుష్టస్వభావముగలది? అయినను యిందు నాతప్పేమిగలదు? మామగారు తనయ నిచ్చెదనని నుడువుటచే నే నాశించితిని. అది దోసమా? తండ్రి కూతు నివ్వ దలచినను వధువు యభిప్రాయమును గమనింప వలదా? సరసిజ యభిప్రాయమును కనుగొనుట సమంజసమే? మామామగా రట్టిల యొనరింపలేదు? వారును నావలెనే సర సిజ సుముఖురాలని తలచిరి గాబోలును. లేకున్న నిటు లేల ప్ర యత్నమొనర్చెదరు. వారి సాహసము క్షంతవ్యమే? నేను సర సిజ యభిప్రాయమును గుర్తింపవలదా? సరసిజ నన్ను వరించిన దనియే భావించితిని. కాని యనంతరము మోహావేశుడనై సర సిజ నెటులైన స్వాధీన మొనర్చుకొనవలెనని యత్నించితిని. అప్పటి నామోహలాలసత్వము నన్ను ప్రేరేపించినది. ఛీ! యెంతటి దుర్మార్గకృత్యము. ఇతరపురుషుని వరించిన స్త్రీని బల వంతముగ స్వాధీనమొనర్చుకొనుటకై నా చేసిన ప్రయత్నము లన్నియు నిష్ఫలములై పోయినవి, దైవము తోడుపడునా? ఇట్టి కార్యములకే నిజముగ దైవము సహాయ మొనర్చునెడల నాతని

దైవమనుటకంటె దయ్యమనుటయే మంచిది. ఇక నీగతించిన దుష్ప్రవర్తనమున కింతటితో స్వస్తిజెప్పి సుహృదయముతో ప్రవర్తించెద గాక !

నామామగారు నన్ను యిల్లువెడలగొట్టుటకుగూడ కారణము ఈ నా దురాచరణమే. సహవాసబలమున నే నిట్టి దుష్కార్యములకు పాల్పడితిని. ఈమిత్రబృందమువలన నే నెన్ని దురభ్యాసములకు లోనయితిని. ఛీ! అవి నా కులగౌరవమున కెంత భంగకరములు. నాయందు లోకులందరకు అసూయ జనించుటయే గాక నామామగారికిని, సుగుణపుంజములగు శ్యామ బాబులకును, అత్తగారికిని, సరసిజకును గూడ జనించినది. నాయందు ఆదరభావముగలవా డొకడును ప్రపంచమున గాన్పించుటలేదు. ఇట్టి నాజన్మము వ్యర్థము. ఆహా! శ్యామసుందరు డెంత సుగుణవంతుడు. నాయొనర్చిన దుష్కార్యములకు నేనే పశ్చాత్తాపపడవలసి యున్నది. నాడు తిమ్మిలేరుకడ నేను మద్యపానముచే స్మృతితప్పి పడియుండిన సమాచారమును ఆతడు ఎంత గూఢముగా వ్యక్తీకరించెను! మరియొకడైన యింటికివచ్చుటతోడనే మామగారికిని, తదితరులకును జెప్పి పరువుదీసి యుండెడివాడే. ఆతని సుహృదయమును వేనోళ్ళ బొగడవలసియున్నది. సరసిజ శ్యామసుందరుని ప్రేమించినదని నే నెరింగియు సరసిజకొరకై ప్రయత్నించుటయు, అందులకు శ్యామసుందరు డభ్యంతరమనితలచి సుగుణమూర్తియు, నిర్దోషియునగు దేశభక్తుని హత్యగావింప బ్రయత్నించుటయు జూడ నాపాపము వేయిజన్మములకైనను పరిహరింపబడదని తోచుచున్నయది.

ఈక్షణమునుండి నాదుష్ప్రవర్తనమును మానుకొనెదను. ఇంతటినుండి సరసిజను నాసహోదరిగా భావించెదను. నా జీవితమంతయు బ్రహ్మచర్యయుక్తుడనై మెలగెదను. పుణ్యమూర్తులగు సరసిజ శ్యామసుందరుల దాంపత్యమునకు సుఖము గూర్చుటకై నాశక్తి నంతయు ధారవోసి కృషిసల్పెదను. నాయొనర్చిన పాపపరిహారమునకై, వారు యేమార్గము ననుసరించి జీవయాత్ర గడపుచు దేనికొరకై నిర్బంధింపబడిరో నేనును ఆమార్గమునే యనుసరించెదను. సరసిజా! నీ నిర్బంధమువలననే, నేను నేడిటుల కనులతెరచి సన్మార్గమున నడుగిడ గలిగితిని. సచ్ఛీలురు తమకు కష్టముగలిగించువారలకైనను మంగళములనే చేకూర్ప యత్నింతు రను న్యాయము నీయెడల సార్ధకమైనయది. నీ ఈ మేలును తిరుగ తీర్పనిదే కంకణము గట్టుకొనుచున్నాడను. నీవలననే నాజన్మము సార్థకమునొందినది.'

క్రమముగా అతనిహృదయము పశ్చాత్తాపపరిపూర్ణమైనది.

సరసిజ కేసు విచారణ అగుచుండగా అతడు అక్కడకు పోయినాడు. సరసిజకు, కమలాకరునకు చెరి ఆరుమాసముల శిక్ష విధింపబడినది.

వారిని తీసికొనిపోవుటకు రైలుస్టేషనుకు గొనిపోయిరి. ఆసందర్భమున అక్కడ చేరిన జనసమూహమునకు అంతు లేకుండెను.

ప్లాటుఫారముమీద రామమూర్తిగారు మున్నగువారు సరసిజతో మాట్లాడుచుండిరి. అప్పుడు కామేశ్వరుడు అక్కడికి

వచ్చి మేనమామకు సాగిలి మ్రొక్కి తన పశ్చాత్తాపమును వెల్లడించెను. అతని హృదయపరివర్తనమునకు అందరును ఆశ్చర్య మొందిరి.

సరసిజకూడ ఉదారహృదయముతో అతనిని మన్నించెను. అతనినికూడ స్వాతంత్ర్యోద్యమములో పాల్గొనమని హుషారు యిచ్చెను. అతనిని యువజన సంఘాధ్యక్షుని చేసెను. ఆమె మాటను అతడు తులసీదళమువలె తలదాల్చెను.

౯

కామేశ్వరుడు యువజనసంఘాధ్యక్షుడైన నాటినుండియు, ప్రభాకరునితో గలసి రాష్ట్రమునందు తీవ్రముగ ప్రచారకార్యముల నిర్వహించుచుండెను. అంతకు పూర్వము కామేశ్వరరావుయొక్క పరిచయముగలవారెల్లరు నాతని యందు జనించిన యద్భుతమగు పరివర్తనమునకు యాశ్చర్యనిమగ్నులు గాజొచ్చిరి. కామేశ్వరునియందు స్వాతంత్ర్యేచ్ఛ దిన దినాభివృద్ధిని బొంది కార్యరూపమును దాల్చుచుండెను. కామేశ్వరుని యందు గలిగిన యీ పరివర్తనము అతని ఈడువారల నెల్ల దేశసేవానిరతుల నొనర్చివైచెను.

రామమూర్తిగారును, మురళీధరశర్మగారును మరి కొందరు మిత్రుల సహాయమున ఖద్దరు ప్రచారమును, సాంఘిక సంస్కరణమును చేపట్టి యనేకప్రదేశములయందు ఖద్దరు సంస్థలను, సంస్కరణాసంఘములను స్థాపించుచుండిరి. కమలమ్మ, శ్యామలాంబలు యితరస్త్రీల సహాయమున స్త్రీలోకమునందు సంపూర్ణముగా జాతీయప్రబోధమును గావించు

టకై రాట్న గౌరీపూజలను ప్రతి పల్లెటూరునందును స్వయముగా నడిపించుచు ప్రచారము నొనర్చుచుండిరి.

సదాశివయ్యగారు పూర్వముకంటెను తాము ద్విగుణీకృతోత్సాహముతో ఉద్యమమునందు పాల్గొనెదనని వాక్రుచ్చెను.

హేలాపురములో సరళ సమవయస్కులగు కన్నియలతో గలిసి యాపట్టణమునందలి ప్రతి గృహమునకును జనివారలకందరకును కదుళ్ళను, తకిలీలను యిచ్చుటయును, సాయంకాలసమయమున వారు తీసిన దారమునంతను వసూలుజేసి కొనివచ్చి తంతుకారకసంఘమునకు వప్పజెప్పుటయును నిత్యకృత్యములుగా నేర్పరచుకొని దేశారాధన మొనరించుచుండెను.

కొంతకాలమునకు కాంగ్రెస్‌కు, ప్రభుత్వమునకు రాజీకుదరగా ప్రభుత్వము కారాగృహములలో నిర్బంధింపబడియున్న ధర్మవీరులను విముక్తి గావించెను.

యువజనసంఘకార్యనిర్వాహకులగు కామేశ్వర, ప్రభాకరులు విజయపురమున కరుదెంచి స్వాగతసన్నాహము లొనరించుచుండిరి. నాయకుల దర్శనభాగ్యమునకై పలు ప్రదేశములనుండి యరుదెంచిన వేనకువేలు ప్రజలతో ధూమశకటాలయము క్రిక్కిరిసి యుండెను. ఇంతలో రైలుకూత వినవచ్చెను. ప్రజలు యొకరి భుజముల నొకరు యూతగొనుచు బండివచ్చుదిశ నాతురతతో జూచుచుండిరి.

శ్యాముబాబులు సరసిజ, విద్యాధర, కమలాకరులతో బండినుండి దిగి తమ సోదరప్రజలకు నమస్కృతు లొనరించు

చుండ, స్త్రీలు పుష్పవృష్టిని గురిసి కర్పూరపు టారతు లొసం గిరి. సదాశివయ్యగారు శ్యామ, బాబు, కమలాకరుల యాలిం గన మొనర్చి యాశీర్వదించెను. ఇచ్ఛికభటు లిరుప్రక్కల బా రులుదీరి నడువ, స్త్రీలు తమస్త్రీరత్నమగు సరసిజను కుశల ప్రశ్న లొనరింపుచు వెంటనడువ యువజన నాయకులు ధూమ శకటాలయపు టావరణమును దాటిరి. పురపాలకులు స్వాగత మొసంగి గౌరవించిరి. ప్రజలీ దేశారాధకుల నశ్వశకటముపై యాశీనుల గావించి పురము ముఖ్యవీధులనుండి యూరేగింపు టుత్సవముతో సదాశివయ్యగారి గృహమునకు దోడ్కొని వచ్చిరి. ఆదినమంతయు విందులతోడను, ఇష్టాగోష్ఠి తోడను కాలము గడచెను.

మఱునాటి యుదయమున కామేశ్వర ప్రభాకరులు ఈ మిత్రవర్గమును హేలాపురమున కాహ్వానించిరి. శ్యామసుంద రుడు తన జనకునితో గలసి మిత్రులు వెంటరా హేలాపురము నకు పయనమయ్యెను. హేలాపురి విజయపతాకములతో చక్కగ నలంకరింపబడెను. పుర ప్రముఖులు ఈ యువజన నాయకుల నాహ్వానించి సత్కరించిరి. రామమూర్తిగారు మహదానందమున మిత్రుల నాశీర్వదించి వారెల్లరను తమ గృహమునకు దోడ్కొనిపోయిరి. అచట సరళ కర్పూరహా రతులొసంగి స్వాగతమొసగెను. మురళీధరశర్మగారు ఈయువ జన నాయకుల నాశీర్వదించి వారి యోగక్షేమముల నరయ మొదలిడెను. ఇంతలో ప్రభాకరుడు తన మిత్రుల నుద్దేశించి కామేశ్వరునియందు కలిగిన హృదయ పరివర్తనమును విశద పరచి మిక్కిలి సంతసించెను. శ్యామబాబులు యాశ్చర్యము

నొంద, సరసిజ తన మేనబావయగు కామేశ్వరుని సుగుణము లను గొనియాడెను. కమలమ్మ తన ప్రేమంపు బిడ్డల యాలిం గన మొనరించి నయనములనుండి యానందబాష్పము లొల కించెను. సరళ తన నాయకురాలి క్షేమ మరయుచు సపర్య లొనరించు చుండెను. రామమూర్తిగారు తన జన్మసార్థక్యము నొందెనని యానందసుయజలధి నోలలాడిరి.

## ౧౦

ఆమీద ఒకనాడు బాబురావు తన సోదరి మనోవ్యథను గుర్తెరింగి సరసిజను చేరబిలచి అమ్మా! నీయభీష్టసిద్ధికొరకే నేనును ఆలోచించుచున్నాడను. సర్వము శుభప్రదము కాగలదు. ఆతురతజెందక నీవు చింతమానుమని బుజ్జగించెను. అంత సరసిజ ముఖకమలము వికసింప మందహాసవదనయై సరియే యనునట్లు తలయూచి యావలకు బోయెను.

వేరొకగదిలో దేశవార్తలను దిలకింపుచున్న కామేశ్వర, ప్రభాకరు లీ సంభాషణము నాలకించి వెనువెంటనే బాబు రావును సమీపించిరి. సరసిజ వివాహవిషయమై కామేశ్వరుడు ప్రస్తావింపుచు తన మనోనిశ్చయమును తేటపరచెను. శ్యామ సుందరునికి సరసిజ నిచ్చుట యుచితమని కామేశ్వరుడు వాక్రు చ్చెను. బాబురావు శ్యాముని యభిప్రాయమును గనుగొన నిశ్చయించి, శ్యామునిచెంత కరగి యట నాశీనుడయ్యెను. కాని కామేశ్వరుడు బాబురావుకంటె తానే యీవిషయమును ముం దుగ శ్యామసుందరునికి విన్నవింప ప్రభాకరునితో వెడలెను. ఇంతలో సరసిజ తన చెలియగు సరళ సహాయమున ఫలహార

పానీయములం దెచ్చి వారి కడనుంచి, తనసోదరునికి వెనుకను శ్యామునికి యెదురుగను నదోముఖియై నిలువబడియుండెను. సరళ ద్వారముకడ నొకప్రక్కగా నిలువబడియుండెను. బాబురావు వారి సంభాషణామధ్యమం దెటుల వివాహవిషయమై ప్రస్తావింపవలయునో దోపక ఆలోచింపదొడంగెను. అట్టి సమయమున ఫలహారము నారగించుచున్న కామేశ్వరరావు శ్యామసుందరునిగూర్చి ఇటుల ప్రస్తావింప దొడంగెను.

'నేను మీయెడలను, సరసిజ యెడలను యొనరించిన క్రూరకృత్యముల స్మరించిన నాబోటి పాపికి మోక్షమెటుల చేకూరునని తపించి, సత్యాన్వేషణ మొనరించు తమవంటి సచ్చరితుల చరిత్ర కనులారగాంచి, మిక్కిలి లజ్జాక్రాంతుడనై చింతనొందితిని. నాతప్పిదముల తెలుసుకొంటిని. దయార్ద్రహృదయులగు మీ రుభయులు నా దోసగుల మన్నింప వేడుకొనుచుంటిని. మీయుభయుల సచ్ఛీల ప్రభావమే నన్నట్టి పాపకార్యములనుండి మరల్పగలిగినది. నేను మీ ప్రవర్తనము వలన మోక్షసాధన మెఱింగితిని. నాపాపరహితమునకుగాను మీరు సరసిజను వివాహమాడవలయును. నాశ్రేయముకొరకు మీరు సరసిజను చేపట్టి నన్ను ధన్యునిగ జేయుడు. సరసిజ మిమ్ము ఆత్మభర్తగ నిదివరకే వరించియున్నది. అట్టి సచ్చరితయొక్క కోర్కె నిరాకరింపక మన్నించుట సాధులక్షణము. సరసిజయెడ నేను సోదరభావమున మెలగుటకు, నాజన్మాంతము బ్రహ్మచర్య మవలంబించి మోక్షప్రాప్తి నొందుటకు నిశ్చయించుకొంటిని."

శ్యాము:—(నిర్ఘాంతపడి) ఓహో! ఎంతలో నెవ్విధముగ

మారి పోయితివి? నీ విటుల ధర్మశీలుడ వగుదువని నే నెన్నడును తలపలేదు. యని యనెను.

అంత కామేశ్వరుని మనోనిశ్చయమునకు అచ్చటివారు విస్మయులైరి. ద్వారమువెలుపల ఈ సంభాషణయంతయు నాలకించి యానందించుచున్న రామమూర్తిగారు సదాశివయ్యగారితో కలసి ఆగదిని ప్రవేశించిరి.

రామమూర్తిగారును, సదాశివయ్యగారును అట నమర్పబడియున్న కుర్చీలపై నాసీనులైరి. తదుపరి రామమూర్తిగారు తన కొమరుడగు బాబురావునుగూర్చి యిటుల నుడివెను.

"బాబూ! మీ సంభాషణమెల్ల మేము వినియుంటిమి. సరసిజను శ్యామసుందరునికిచ్చు విషయమున నాకును సమ్మతమే. కాని మాబావగారి యుద్దేశ్య మెటులున్నదో"యని యన సదాశివయ్యగారుమాటలాడక మిన్నకుండిరి. ఈ సమయమునందే తలవని తలంపుగ మురళీధరశర్మగారటకువచ్చిరి. అందరునులేచి అటుప్రక్కన పరచియుంచబడిన తివాచీపై ఆసీనులై యిటుల సంభాషింప దొడంగిరి.

మురళీ:—నేను వచ్చుటకు ముందుగ నేదియో విషయమును గూర్చి ముచ్చటించుచుంటిరి. అది ఏమి?

రామ:—మరేమియు లేదు. మన సరసిజ వివాహమునుగూర్చి ప్రస్తావన జరుగుచుండెను.

ముర:—ఐతే సంబంధ మెచటనున్నయది?

రామ:—మరెచటనుగాదు; శ్యామసుందరరావునకు యిచ్చి పరిణయ మొనర్పవలయునను అభిప్రాయమును మాత్రమే గలదు.

మురః—అటులయిన సంశయమేమిగలదు? "శుభస్య శీఘ్ర మ్మను"నట్లు లగ్నము నిశ్చయము చేయుడు.

రామః—బావగారి అభిప్రాయమేమో వెలిబుచ్చరైరి గదా!

సదాః—ఆ విషయమునుగూర్చి శ్యాముని సమ్మతమే నా సమ్మతము.

శ్యామః—నాన్నగారు! పెద్దలగు మీ యభిమతమే నా యభిమతము.

సదాః—ప్రేమాధికముచే అంతరాత్మతో నాథునిగ వరించి, మానసికముగ వివాహమాడిన వనితనే పరిణయ మాడుట పరమధర్మము.

ఇట్లు వారు పలుకుటతోడనే యందరి ముఖకమలములు వికసించినవి. కాని సరసిజ మాత్రము ఏలకో తలవంచియే యుండుటను గాంచి కామేశ్వరరావు సదాశివయ్యగారిని గూర్చి.

"బాబుగారూ! తాము నుడివిన విషయము నాబోటి వానికి పూర్ణముగ అర్థమగునటుల దయతో సెలవీయ గోరుచున్నాను" అని నుడువ సదాశివయ్యగారా యువ[illegible] పలుకులకు నవ్వి "సరసిజను నాకొమరుని భార్యగా చెసకొన[illegible] సమ్మతించితిని. కాని శర్మగారూ! తమ కూతును బాబుర[illegible] కొసంగి ఈ రెండు వివాహములు ఏకకాలమున తమ [illegible]ర్యముననే నడిపింపుడు" అని పలుక యెల్లరు సంతసించిరి. వెంటనే పురోహితుల రావించి లగ్ననిశ్చయములు చేయింప వలయునని కామేశ్వరుడు కోరెను. కామేశ్వరుని కోరికన మన్నించి రామమూర్తిగారటులనే లగ్ననిశ్చయముల నొనర్ప సమ్మతించెను.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B196 |
| పుస్తకం పేరు | త్యాగ మహిమ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |